GOTETI

వేరుగ ఉంటం వద్దురా
అందరమూ కలిసున్నామంటే
ఎంతో ఎంతో హాయిరా_
సమష్టి కుటుంబ ప్రబోధాన్ని
సరసంగా చిత్రించిన సాంఘిక చిత్రం.

చూడకపోతే_
చూచినా తిరిగి **నేడే** చూడండి



ఆజేమ్ ఆర్ట్సు...

# తల్లిప్రేమ

నిర్మాత...M. ఆజేమ్
దర్శకత్వం: శ్రీకాంత్

మాటలు..
భమిడిపాటి రాధాకృష్ణ
సంగీతం...
సుదర్శనం
పాటలు...
కొసరాజు
సి.నారాయణరెడ్డి
దాశరథి
ఛాయ
బాలకృష్ణ



CHE PRASAD

..పూర్ణా రిలీజ్..

19040

వెన్నెలలాంటి అనురాగం,
వెల్లువలాంటి అభిమానం.
కలిసి
సెలయేరులా ప్రవహించిన
అందాల హాస్యరసభరిత సాంఘికం!

# తప్పక చూడండి!




డి.వి.యస్. ప్రొడక్షన్స్

# తిక్క శంకరయ్య

దర్శకత్వం: డి. యోగానంద్

నిర్మాత: డి. వి. యస్. రాజు

రచన: డి.వి.నరసరాజు • పాటలు: సి.నారాయణరెడ్డి-కొసరాజు
సంగీతం: టి.వి.రాజు  కెమెరా: జి.కె.రాము • ఆర్ట్: తోట
నృత్యం: వెంపటి • చిన్ని • సంపత్





ఆంధ్ర-సీడెడ్: విజయ
నైజాం: ఉషా
మైసూరు: సదరన్ మూవీస్



STUDIO Ketna

# సబ్బులన్నియు శుభ్రపరచును కాని...

... నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం

## జి-11తో గూడియున్న సింథాల్

మీకు కావలెను.

సింథాల్ యందు గల జి-11 (హెక్సాక్లోరొఫీన్) చర్మ పొరలను గలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది, ఆహ్లాదకరంగా పరిమళమొనర్చబడినటువంటి జి-11 తోగూడియున్న సింథాల్ మీ చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.




INTERPUB GCS 9A-TEL

వ్యంగ్యమనీ, అందులోని రసం హాస్యమనీ, దానిని చదివే పాఠకులు నవ్వాలి సుమా అనీ, అది నిజం అని భ్రమపడరాదనీ ఆ వ్యాసానికి చివర లేదా ముందర పెద్ద పెద్ద అక్షరాలలో షరా వ్రాసి ఉండవలసింది. అల్లా చేయడం మరిచిపోయిన నా తప్పును క్షమించే విశాలహృదయం పాఠకులకు ఉంటుందని నా ఆశ. ఆ విధమైన షరా వ్రాయకపోయినప్పటికీ ఏదో కొద్దిమందికైనా ఆ వ్యాసం తాలూకు గుట్టుమట్లు తెలిసినందుకు అనందానంద కందళిత హృదయారవిందనగుచున్న దానను.

ఆ వ్యాసంలో పరమ పవిత్రమైన మన భారతీయ సంస్కృతిని అవహేళన చేశా

## ఉత్తరాలు

నని, నాకు దేశభక్తి ఉండవలసిన మోతాదులో లేదని కొందరు అభాండం కూడా వేసేశారు. అన్యాయం! అన్యాయం! నాకు దేశభక్తి లోపం లేదని పలువురు పెద్దలు ఇచ్చిన సర్టిఫికెట్లు ఉన్నాయి. వాటి ఫోటో కాపీలు తీసి, ఈ పత్రికలో వేయించాలని ఉంది కానీ, గౌరవనీయులైన ఎడిటరుగారు అమూల్యమైన తమ పత్రికా స్థలాన్ని ఈ విధంగా ఖర్చు పెట్టరేమో అనే భయం ఉండడంచేత ఆ పని విరమించుకుంటున్నాను.

ఇంక సెలవా మరి,

మహీధర సుభద్ర. (ఢిల్లీ)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 5—4—'68
కీలకనామ సం॥ చైత్రమాసం॥ శుద్ధ సప్తమి
సంపుటము : 60 సంచిక : 30

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : కుముద్ ఛుగ్ణాని

పూర్తి అయింది. భోజనం వడ్డించుకుంది. ఎప్పటిలాగే చేపకూర, అన్నం ఆమె ఆహారం అయితే, తినటం మొదలుపెట్టే ముందు మరొకసారి బయటికి తొంగి చూడ బుద్ధివేసింది...

ఈసారి ఆమె ఆశ నెరవేరింది. దూరంగా ఒక ఆకారం కదిలివస్తోంది. అంత చీకటిలోనూ కదలికనిపట్టి వచ్చేది ఒక స్త్రీని గ్రహించింది.

అవును ఆమె తెల్లచీరకూడ కట్టింది. గోవాలో తెల్లచీరలు (ఓలె) ధరించేది ఎవరు, కొంచెం కలవారు కాకపోతే?

ఆ వనిత దగ్గిరికి వచ్చింది. ఫిలోమెనా పరుగెత్తి పిలిచింది. 'ఏమమ్మా తెల్లచీర చెల్లాయి! ఇదిగో మాట!'

ఆ వనిత ఈ కేకవిని నడకవేగం తగ్గించింది.

'తొందరగా పోతున్నావు, ఊళ్ళోకేనా?' అని అడిగింది ఫిలోమెనా ఆప్యాయత ఉట్టిపడే గొంతుకతో. 'అదింకా మయిలున్నరుంది! కాసేపు సేదతీర్చుకుని పోదువుగాని రా!'

ఆ తెల్లచీర అమ్మాయి సందిగ్ధంగా అలాగే నిలబడిపోయింది.

'ఏమిటి, ముక్కూ మొగమూ ఎరుగనిది ఇలా పిలుస్తోందేమిటని భయపడుతున్నావా? నా మనస్సులో ఉన్నది నీతోచెప్పకపోతే ఏసుప్రభువు నన్ను క్షమించడు!' ఫిలోమెనా కంఠస్వరంలో భక్తి, దయ ఉట్టిపడ్డాయి. ఆమె గాంభీర్యానికి ఆ అమ్మాయి చలించింది. మాట్లాడకుండా వచ్చి అక్కడే ఒక చిన్న బల్లఉంటే దానిమీదవచ్చి కూర్చుంది.

'సరేగాని, ఆ దంతప్రాసు వేసుకున్న అమ్మాయి సంగతి నీకు తెలిదా ఏమిటి?' అని అడిగింది ఫిలోమెనా.

తెల్లచీర యువతి సంకోచించింది. చివరికి, 'తెలీక పోవటం ఏమిటి? ఆమె ఒక నాడు ఈ చోటులోనే ఎక్కడో మాయమయిపోయిందట గదా!' అన్నది బెరుకుగా.

'అవునా! నీకూ తెలుసు కదా! మరి ఒంటరిగా ఇలా వెళ్ళిపోతానంటావేమిటి? ఈ చోటు ఎంత చెడ్డదో నీకూ తెలుసుకదా మరి! పాపం పెరిగిపోతోంది! అసలే బాగా లేవు రోజులు! ఎక్కడ చూసినా దోపిడీలూ, దొంగతనాలూను! రెండు నెలల క్రితమే ఇద్దరు ఆడవారు మాయమయ్యారు—మరి అతి సాహం చేస్తే ఎలాగ చెప్పు?'

ఆ అమ్మాయి చెప్పలేక పోయింది.

'ఇదిగో చూడమ్మాయి! నేనేమీ గొప్పింటి దాన్నికాదు. ఏదో సేద్యం చేసుకుని బతుకుతున్నాను. నిన్ను చూస్తే ఎందుకో జాలిగా ఉంది. నువ్వేమీ బెంగపెట్టుకోక ఈ రాత్రికి ఇక్కడే ఉండిపో! నాతోబాటే ఏదో కాస్త ఎంగిలిపడు. నీకూ ఓ చాప వేస్తాను పడుకో...' అన్నది బుజ్జగింపుగా.

తెల్లచీర కట్టుకున్న యువతి కదిలిపోయింది. వెంటనే ఫిలోమెనా చెప్పినదానికి సరేనన్నది.

భోజనం చేస్తున్నప్పుడు ఫిలోమెనా దంతప్రాసు అమ్మాయి విషయమే ప్రస్తావించింది.

'ఆ దంతం ప్రాసు నువు చూడలేదు కదూ? నేను చూశానొకసారి. అదేదో సంతదగ్గిర ఆ అమ్మాయి నుంచుని ఉండగా చూశాను. అందరికళ్ళూ ఆ ప్రాసుమీదనే ఉన్నాయి అప్పుడు! అది ఎక్కడదనుకున్నావు? రోమ్‌లో చేసిందిట! ఆ అమ్మాయి మొగుడు ఆఫ్రికాలో ఎక్కడో పనిచేస్తున్నాడుట. వాడే పంపించాడనుకున్నారంతా!—'

భోజనం ముగిసింది. ఫిలోమెనా ఇంకా ఏమేమో చెప్పుకుంటూ పోయింది.

కొంతసేపు తర్వాత ఇద్దరూ చాపలు పరుచుకున్నారు.

'అవును నీ పేరేమిటన్నావు, మరియా కదూ! చలికాలం, ఈ దుప్పటి కప్పుకో—' అంటూ ఫిలోమెనా అక్కడ ఉన్న ఒక్క దుప్పటినీ ఇచ్చింది.

మరియాకి ఈ ఆప్యాయత మరీ అధికంగా తోచింది. మొహమాటం పడింది. ఎలాగో ఆ దుప్పటి పుచ్చుకోకుండా ఫిలోమెనాకి నచ్చచెప్పి తన చీరనే విప్పి నిండా కప్పుకుని పడుకుంది. ఇది ఆ ప్రాంతం ఆడవారికి అలవాటే.

ఇద్దరూ నిద్రలో మునిగిపోయారు.

హఠాత్తుగా మరియాకి మెలకువ వచ్చింది. ఏమిటో కలతగా ఉంది ఆమె మనసు. ఫిలోమినా పడుకున్న వైపు చూసింది. ఆమె పక్క ఖాళీగా ఉంది! ఎందుకో కీడు శంకించింది మరియా. చప్పుడు చెయ్యకుండా లేచివెళ్ళి గోడకి ఉన్న చిన్న కిటికీలోనుంచి తొంగిచూసింది. ఆమె వళ్ళు ఝల్లుమంది.

ఫిలోమినా తోటలో నుంచుని ఒక గొయ్యి తీస్తోంది. ఏమయినంత నిశ్శబ్దంగా తనపని చేసుకుంటోంది ఆమె. మరీయా భయం పీడకల లాగ అవ్యక్తంగా ఆమెని తల్లడిల్ల చేసింది, అక్కడినుంచి వెళ్ళిపోవటమే శ్రేయస్కరం అనిపించింది ఆమెకి. మెల్లిగా తన చీరని కట్టుకొనటం మొదలుపెట్టబోయింది.

'అయితే, ఆమె దురదృష్టం! అదే క్షణంలో ఆమెకి ఒక తుమ్ము వచ్చింది. ఎంత ఆపుకుందామన్నా ఆపుకోలేకపోయింది.

ఫిలోమినా పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చింది.

'ఏమిటమ్మాయి, ఎందుకులేచావు?' అని అడిగింది. 'ఆ, ఏమీలేదు ఒకసారి అలా బయటికి వెళ్ళివద్దామని,' అని సమాధానం ఇచ్చింది మరీయా.

'అబ్బే! ఈ చీకట్లో బయటికి ఎందుకు, ఆ పెరడు చాలు!' అంటూ ఇంటి వెనకభాగం చూపింది ఫిలోమినా.

మరీయాకి ఏమీ పాలుపోలేదు. ఇక ఏమీ చెయ్యలేక ఫిలోమినాని ఒక్క తోపు తోసి, తలుపు తెరుచుకుని బయటికి పరిగెత్తింది. ఆమె చీర మాత్రం ఫిలోమినా చేతిలో ఉండిపోయింది.

'ఇదిగో అమ్మాయి నీకు మతిపోయింది! నడు వీధిలో దిసమొలతో పరిగెత్తుకెడుతున్నావు! వెనక్కిరా!' అని అరిచింది ఫిలోమినా.

మరియా ఆమె అరుపులని వినిపించుకోలేదు. అలాగే పరిగెత్తుకుంటూ మాపా పోలీసు స్టేషను చేరుకుంది. అప్పటికి కాని తన పరిస్థితి అర్థంకాలేదు ఆమెకి. కొంత సేపు ఆలోచించి పక్కనే ఉన్న అరటి తోటలోకి వెళ్ళి అరటిఆకులు కొన్ని కోసి తన ఒంటి చుట్టూ చుట్టుకుని స్టేషనులోకి వెళ్ళింది.

* * *

మర్నాడు ఉదయం ఒక పోలీసు జట్టు వెళ్ళి ఫిలోమెనా తోట త్రవ్వి చూశారు. అక్కడ దంతపు ప్రాసు మెడని ఉన్న స్త్రీ అస్థిపంజరం ఒకటి దొరికింది! అక్కడ నగలన్నీ వొలిచి ఉన్నాయి. ఆ ప్రాసుని సంతలో అందరూ గమనించారు. అది దొంగిలించటం మంచిది కాదని ఫిలోమినా గ్రహించి అలాగే వదిలి వేసింది.

ఇంకా త్రవ్వగా మరి రెండు ఎముకల గూళ్ళు దొరికాయి...

గోవాలో మరణ దండన లేదు. ఫిలోమినాని యావజ్జీవ కారాగృహ నివాసం కోసం ఆఫ్రికాకి పంపించారు పోర్చుగీసు అధికారులు. ●

# ఏప్రిల్ ఫూల్స్


ఆ ఫూల్ భగవాన్లుగాడు లేడూ-ఇక్కడికి వస్తున్నానని టెలిగ్రాం ఇచ్చాడు. నేను చచ్చీ చెడి స్టేషన్‌కి పరుగెట్టా!
APRIL 1


మన కుర్రాళ్లు మరీ వెధవలై పోతున్నారు - హెడ్మాస్టర్తో చెప్పి వీళ్లని.....


ఇవాళ ఏప్రిల్ ఫస్టు గదా! చిన్న తమాషా చేశా! వెధవ స్పోర్టివ్‌గా తీసుకునే గుణం లేదు!


భలే ఫూల్‌ని చేశా వెధవని - తెల్ల మొహం వేశాడు!


ఈ ప్రేమలేఖ నువ్వు రాసింది కాదా? మరి ఎవరు రాశారు? అమ్మో! దేవుడా ఎవరు రాశారూ?


ఎవరన్నా ఫూల్ చేస్తారేమో అని భయపడి శెలవు పెట్టి ఇంట్లో కూర్చున్నారు- ఇదే సమయమని నే ఫూల్ చేసి పడేశా!

# మందులని ఎదిరించే బాక్టీరియా

ఈ మధ్య ఇంగ్లాండు ఈశాన్య ప్రాంతంలో ఎందరో చిన్నపిల్లలు 'గాస్ట్రో ఎన్‌టిరయిటిస్' వచ్చిపోయారు ఈ జబ్బు అంటీబయోటిక్స్ (పెన్సిలిన్ వగయిరా) మందులకి చావని సూక్ష్మ క్రిములవల్ల వచ్చిందని తేలింది. ఆవులు మొదలయిన జంతువులకి అధికంగా అంటీ బయోటిక్స్ వాడటంచేత ఈ క్రిములు బలపడి జంతువులద్వారా మానవులమీద పడ్డాయని కొందరి ఊహ. ఈ అనుమానాన్ని రుజువు చెయ్యటం కష్టంకాని, మొత్తంమీద నమ్మతగ్గట్లే ఉంది.

ఆరోగ్యశాఖలో పనిచేసే ఒక పెద్ద అధికారి బ్రిటిష్ మెడికల్ జర్నల్ పత్రికలో అంటీబయోటిక్స్ అపరిమితంగా వాడుతున్నారని అన్నారు. బిబామ్స్ అనే పెద్ద అంటీబయోటిక్స్ తయారు చేసే కంపెనీవారు పత్రికా సమావేశం పెట్టి వాటి వాడకాన్ని ఇలా ఖండించటం సబబు కాదన్నారు.

ప్రభుత్వోద్యోగి పేరు డా. ఇ. ఎస్. ఆండర్సన్, ఆయన జబ్బుపడిన చిన్న పిల్లల దేహాలలోనుంచి తీసిన సూక్ష్మ క్రిములని పరిశీలించి అవి వివిధ రకాల అంటీ బయోటిక్స్ (మందుల) ధాటికి నిలవగలవని నిరూపించాడు.

అంతేకాక, ఈ రకం బాక్టీరియా మామూలు రకం వాటికి తగిలితే చాలు వాటిని కూడా మార్చెయ్యగలవుట!

చాలాకాలం అంటీబయోటిక్స్ పుచ్చుకున్న జంతువుల మాంసం తింటే ఈ క్రిములు దేహంలోకి ఎక్కవచ్చునని డాక్టర్ ఆండర్సన్ అభిప్రాయం. ఈ విషయమంలో పరిశోధనలు ఇంకా జరగవలసి ఉంది.

మానవులకి కూడా విచక్షణ లేకుండా అంటీబయోటిక్స్ ఇవ్వటం సరికాదని డా. ఆండర్సన్ అంటారు. ఈ విషయమయి దీర్ఘమయిన అనుశీలన అవసరం అని ఆయన నమ్మకం.

డా. ఆండర్సన్ వెలిబుచ్చిన అభిప్రాయాలని తీసుకుని కొందరు పత్రికా రచయితలు కూడా విచక్షణలేకుండా అంటీబయోటిక్స్ వాడకంమీద దండయాత్రలు సాగించారు. అందుకనే బిబామ్స్ కంపెనీవారు అంటీ బయోటిక్స్ ఉపయోగం ముందుముందు మరికొన్ని వ్యాధులని అరికట్టగలదని నిరూపించే సమాచారాన్ని వెలువరించారు.

బాక్టీరియాలలో అధికభాగం రకాలు అంటీబయోటిక్స్ ధాటికి ఆగగలవనటం సరికాదని నిరూపించే అంకెలు ఎన్నో ప్రకటించారు. అదీకాక, ఎప్పటికప్పుడు కొత్త రకం అంటీబయోటిక్స్ కనిపెట్టటంవల్లా, అవి పాతవాటికంటే శక్తివంతమయినవి కావటంవల్లా, బజారులోనుంచి తయారయ్యే అంటీబయోటిక్స్ రకాలకన్నా కృత్రిమంగా తయారుచేసే రకాల సర్వాణంలో అభివృద్ధికి తోడ్పడే అవకాశాలు ఎక్కువ ఉండటంవల్లా అకారణంగా బెదిరిపడనక్కరలేదన్నారు.

ఇక జంతువుల సంగతి తీసుకుంటే— అంటీ బయోటిక్స్ ద్వారా సాధించిన మార్పులు కూడా అపారం అన్నారు: మాస్టయిటిస్, నిమోనియా, ఎంటిరయిటిస్ వ్యాధుల విషయంలో సాధించినది ఎంతో గమనించాలి. ఈ మందులు వాడకపోయినట్లయితే వ్యాధి సోకిన జంతువులని చంపటమే గత్యంతరం. అయితే ఈ రంగంలో మరింత పరిశోధన అవసరం అని బిబామ్స్ వారు అంగీకరించారు. ఈ పరిశోధనలో తాము పూర్తిగా పాల్గొనటానికి సిద్ధంగా ఉన్నామన్నారు.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని వారు నొక్కి చెప్పారు. అంటీ బయోటిక్స్ మోతాదు పూర్తిగా తీసుకోనకపోతే బాక్టీరియా మందులకి తట్టుకోనగలిగే శక్తిని తెచ్చుకుంటాయి, అని. అందుకనే మోతాదు సరిగా ఉండాలి.

ఈ వాద వివాదాల సారాంశం ఏమిటంటే, అంటీ బయోటిక్స్ వాడకం అసలే ఆపటం మంచిది కాదు. క్రిములనే 'దొంగల'ని నాశనం చేసే అంటీ బయోటిక్స్ 'పోలీసులు' మంచి జోరుగా ఉన్నారు కాని, పాడి జంతువులు, మాంసం కోసం పెంచే జంతువులు వీటికి విచక్షణ లేకుండా పెన్సిలిన్ రకం మందులు వాడటం మంచిది కాదు. కనీసం పునః పరిశీలన అవసరం.

కాని చివరి సూచన — మందులు పుచ్చుకునేవారు పూర్తి మోతాదు పుచ్చుకోవాలి.

—ప్రో. వ. ఫీ. వైజ్ఞానిక విశేషిణి.

## నన్‌ల ఆయుస్సు ఎక్కువా?

బ్రహ్మచర్యాన్ని స్వీకరించిన క్రైస్తవ సన్యాసినీ (నన్)లు సంసారి స్త్రీలకన్నా ఎక్కువ రోజులు బ్రతుకుతారుట. వారి ఆరోగ్యం సాధారణంగా బాగుంటుందిట.

లూయిసియానా స్టేట్ యూనివర్సిటీకి చెందిన డాక్టరు జేమ్స్ టి నిక్స్, 108,847 మంది నన్‌లు — వీరు 223 సన్యాసినీ లేక 'విహారా'లలో ఉంటున్నారు — ఆరోగ్యానికి సంబంధించిన వివరాలని పరిశీలించి ఈ అభిప్రాయానికి వచ్చారు. వారి ఆయుస్సు 50 శాతం అధికంగా ఉంటుందిట.

'అందరికీ వయస్సుతోబాటు బుద్ధిబలం వగయిరా పడిపోవు. ఎందరో నన్‌లు 65 తర్వాత కూడా తమ పనులు చురుకుగానే చేసుకుంటూ ఉంటారు,' అంటారు డా. నిక్స్.

నన్‌లు [illegible] తాగరు. దీనివల్ల కడుపులో పుళ్ళు రావు వారికి. వారు సాధారణమయిన ఆహారం తింటారు. దానివల్ల పిత్తకోశంలో గడ్డలు రావు. ఒకవేళ అపురూపంగా వచ్చినా చాలా చిన్నవిగా ఉంటాయి. (ఒక్క మదర్ సుపీరియర్ మాత్రం సాధారణంగా బయట భోజనాలు చేసినప్పుడు ఈ ప్రమాదానికి గురి కావచ్చు. అందుకనే ఈ పదవిలో ఉన్నవారికి గడ్డలు వస్తూ ఉంటాయి!)

మూత్రపిండాలూ, హృదయాలూ కూడా నన్‌లలో త్వరగా చెడిపోవు. కాన్సర్ వీరిలో ఎప్పుడోకాని తల చూపదు. —అన్‌హోనిగ్ (ఇన్‌ఫా)




**పి. ఎస్, పాల్వంచ**

ఇరవైనాలుగు గంటలూ అద్దంలో తన ముఖం చూసుకుని మురిసేవారి నేమంటారు?

నార్సిసస్ అనాలి. వెనకటికో పెద్ద మనిషి తనని అద్దంలో చూసుకుని ప్రేమించుకుని చివరి కదే [illegible] పోయాట్ట!

**డి. కె. కె. దేవరపల్లి**

వరకట్నాలు నిషేధం అన్నారు కదా, మరి నూటికి నూరు పెళ్ళిళ్ళూ కట్నం అనే సముద్రం దాటంది సంసారపు ఒడ్డుకు చేరడం లేదు. ఆచరించని చట్టం పట్ల మీ అభిప్రాయం ఏమిటి?

సాంఘిక సంస్కరణలన్నీ, మనుషుల హృదయ పరివర్తనతో సంబంధం కలవి కొన్ని ఉంటాయి. వాటిని చట్టాల ద్వారా అమలు పరచాలని చూడ్డం అవివేకం. మన వరకట్న నిషేధపు బిల్లూ, మద్య నిషేధమూ దీనికి నిదర్శనలు.

**యస్. పి. జగిత్యాల**

అన్నదానము, రక్తదానము ఈ రెండింటిలో ఏది గొప్పది?

అవసరానికి ఉపయోగిస్తే— రెండూ గొప్పవే.

**ఎన్. వి. ఆర్. అలిమేరువాగు**

మానవునికి అమితమైన సంతోషం, అమితమైన దుఃఖం ఎప్పుడు కల్గుతవి?

ఎదురు చూడనిచోట ఆప్యాయత లభించినప్పుడు.

**పి. ఎస్. ఎమ్. చిట్యాల**

సృష్టిలో గల చెట్లలో ఆకులు రాలిపోని ఆకు ఏది?

ఆకు రాల్చని చెట్టు ప్రకృతి [illegible] మానవుడూ ఉంటారా అని?

**కె. ఎల్. ఆర్. హైదరాబాదు**

ఆమె నన్ను, నేను ఆమెని ప్రేమించుకున్నాం. కాని ఆమె ఇంకొకరిని పెళ్ళి చేసుకుంది. అప్పుడామెను ఏమనాలి? నేనేం చేయాలి?

మామూలు మనిషి అయితే ఆమె సంగతి మరిచి పోయి బ్రతకడం ప్రారంభించాలి. సినిమా హీరో అయితే— పిచ్చెత్తి పిచ్చాళ్ళలాగా తిరగడం ప్రారంభించాలి!

**సిహెచ్. ఎన్. మార్తేరు**

ఇద్దరు స్నేహితురాళ్ళని విడదీయాలని చూస్తున్నారు కొంత మంది చీడపురుగులు. వారిని తొలగించాలంటే ఏం చేయాలి?

ఆ చీడపురుగులకి విడిపోతారేమో అనే భయం ఎందుకో— ఆ 'స్నేహితురాళ్ళ'కి!

**ఎన్. వి. ఆర్. పిఠాపురం**

నేటి నవనాగరికతపై మీ అభిప్రాయం ఏమిటి?

కాలానికి తగ్గట్టు ఉండాలని.

**ఎ. కె. ఆర్. సుద్దాల**

నా కొక మిత్రుడున్నాడు. ఎవ్వరితోనూ సరదాగా సంతోషంగా ఉండడు. కారణం ఏమీ లేదంటాడు.

గంభీరంగా ఉండడం అతని స్వభావమేమో.

**సి. పి. ఆర్, చీరాల**

నేను మిమ్మల్ని ప్రేమించుతున్నాను.

నా [illegible] బాబూ, బాగా చదువుకోండి.

**ఎమ్. ఎస్. ఆర్, మద్రాసు**

నేను కొద్దిగా కోపిష్ఠిని. ఇటీవల వివాహం చేసుకున్నాను. ఆమె కూడా కోపిష్ఠి అని తెలుస్తోంది. ఇక మా సంసారం ఎలా ఉంటుందో ఊహించవచ్చు...

భయపడకండి. ఇద్దరికీ కోపం పోవచ్చు. లేదా సరదాగా ఇద్దరూ కోపంగా మూడు పువ్వులూ ఆరు కాయలుగా సంసారం సాగించవచ్చు!

**కె. ఎమ్, తిరుపతి**

ఈ ఉద్యమాలకి కారణం ఏమిటి?

మానసిక స్తబ్ధతకి విప్లవాత్మక రూపం.

**పి. జె. ఆర్, పిఠాపురం**

డిటెక్టివు పుస్తకాలపై మీ అభిప్రాయం?

కాలక్షేపానికి బఠాణీలు లాంటివి.

**డి. జె. ఆర్, ముడుంపాడు**

రంగులరాట్నం లాగా సాగిపోయే 'బాల్య' కౌమార్య యవ్వన దశలలో మానవుడు తన బాధ్యతల నెలా నిర్వర్తించాలి?

బాల్యానికి కౌమార్యానికి భయం లేదు — పెద్దల బాధ్యత వహిస్తారు. ఇక యవ్వన దశలోనే మహా జాగ్రత్త!

**కె. పి. కరీంనగరు**

ప్రపంచంలో ఎన్నటికీ మానవునికి అంతుచిక్కనిది ఏమిటి?

సృష్టి రహస్యం.

**సి. పి. ఆర్. మంచిర్యాల**

చిన్నతనంలో పెళ్ళి చేసుకోవడంమంచిదా? ఆడపిల్ల ఎదిగేవరకు ఇద్దరిలో ఏ ఒక్కరైనా చచ్చిపోవచ్చు, లేక ఇద్దరి మనస్సులు కలవ గలవని గ్యారంటీ ఏమిటి?

బాగుంది! వెనకటికి మీలాంటి పెద్దమనిషినే పెండ్లి సంబంధం చూసి రమ్మని పంపారుట. చూసి వచ్చి 'ఎలా ఉంది పిల్ల?' అని అడిగితే— "అంతా బాగానే ఉంది కాని కొంచెం మనస్తత్వానికి [illegible]" అన్నాట్ట! అలాగుంది మీ [illegible].

**జి. ఎన్. ఆర్మూరు**

స్త్రీ జీవితం ఒక వర్షబిందువులాంటిదంటారు ఎందుచేత?

వర్షబిందువు చిప్పలో పడితే ముత్యంగా తయారవుతుంది. మురికైతే ఇంకి పోతుంది. అలాగే స్త్రీ జీవితం కూడా అలాగే సరైన ప్రారంభంలో పడితే సుఖాంతంగా సాగిపోతుంది. లేకుంటే [illegible].

**ఎస్. బందరు**

నీతికి నిజాయితీకి మధ్యదూరమెంత?

[illegible] నీతి ఒప్పినవాడు నిజాయితీ గలవాడని ఎవరూ అనరు కదా?

**ఎన్. వి. ఎస్. ఎస్. మూర్తి, బరంపురం**

ప్రేమ గుడ్డిది అని కొందరు, ప్రేమ దైవం అని కొందరు అంటారు, మరి మీరేమంటారు?

ప్రేమ అన్నది పూర్తిగా వ్యక్తిగత విషయం అని.

**ఆర్. ఎన్. ఆర్. జగదల్పూరు**

సంసారంలో కలతలవల్ల భార్యాభర్తలు విడిపోయినప్పుడు పిల్లలు ఎవరికి చెందుతారు? తల్లికా? తండ్రికా?

ఇద్దరూ వద్దంటే అనాధశరణాలయానికి!

**యం. పి. కరీంనగరు**

చదువు సంస్కారము లుండికూడా క్రూరంగా ప్రవర్తిస్తారెందుకు?

చదువు సంస్కారాలకీ, క్రూరమైన ప్రవృత్తికీ సంబంధం లేకపోవడం వల్లనే.

ఒకశాతం విపరీతం

# అన్నం పెట్టని అమ్మని చంపిన కొడుకు!

దిండివనం తాలూకా కిళ్ప్పాకమ్ అనే వూళ్లో కన్న తల్లిని చంపిన లక్ష్మణన్ అనే అతన్ని పోలీసులు అరెస్టు చేశారట. అన్నం పెట్టమంటే యాభై అయిదేళ్ల అతని తల్లి 'మూడు నాలుగురోజుల నుంచీ అప్పుచేసి వండి గుమ్మరించాను. ఇక నా వల్లకాదు' అందట. దాంతో లక్ష్మణన్‌కి ఆవేశం వచ్చి కర్రతో తల్లిని బాదాడట. అసలే వయస్సు చెల్లిన ఆవిడ అక్కడే విలవిల తన్నుకుని చనిపోయింది. ఈ మాతృ హంతకునికి శిక్ష ఏమిటి— మరణశిక్ష కన్న పైన శిక్షే లేదుకదా!

## భార్య అక్రమ సంబంధం-భర్తకి మరణ దండన!

తన భార్యకు, తనతో స్కూల్లో పని చేసే కుమారస్వామి అనే అతనికి అక్రమ




సంబంధం వుందని పసిగట్టిన జాన్ ఇజాక్ అనే అతను కొడవలితో భార్యను నరకబోయి, అడ్డొచ్చిన ఇద్దరు పిల్లల్ని ముందు నరికి పారేశాడట. మరో యిద్దరు పిల్లలకు గాయాలయ్యాయి. ఇతను మాయవరం గవర్నమెంట్ ట్రయినింగు స్కూల్లో టీచరట. మార్చి 15న ఈయనకు మరణదండన విధించబడింది.

## పదహారు శవాలు!

బెంగుళూరులో 16 మంది కల ఒక కుటుంబాన్ని ఒక వ్యక్తి సర్వనాశనం చేశాడట. ఈ హంతకుడికీ ఇంటి పెద్దతో ఓ ఘర్షణ వచ్చిందనీ, కోపంతో ఆయన్ని కాల్చి చంపి, ఇంటికి పెక్కు చోట్ల నిప్పు అంటించాడని తెలిసింది. (మార్చి 16న) పోలీసులు కాలిపోయిన 16 శవాలనూ బయటికి తీశారట.

## బొగ్గుతో బుగ్గయిన కుటుంబం

హిందుస్థాన్ ఫొటో ఫిల్మ్ తయారీ కంపెనీ పనివారుండే యిళ్లల్లో ఒక యింట్లోంచి దుర్గంధం వస్తోందని తలుపులు పగలకొట్టి చూస్తే లోపల నాలుగు శవాలున్నాయట. ప్రాణాపాయ స్థితిలో వున్న ఒకతన్ని ఆసుపత్రిలో చేర్చారట. గండం గడిచి బయట పడినతని భార్య యిద్దరు పిల్లలు, ఇంటికి వచ్చిన చుట్టం చని పోయారట. ఇకో బొగ్గు మంట, పొగ వీరి చావుకి కారణం అని అనుమానించారు.

*  *  *

మద్రాసు జార్జిటవున్ ప్రాంతంలో ఎల్లప్పన్, మురుగన్ అనే అన్నదమ్ములు పోట్లాడుకున్నారట. ఒనక ఎల్లప్పన్ భోజనం చేస్తుండగా మురుగన్ వచ్చి అతన్ని పొడిచి చంపి, అప్పుడే ఆ ప్రాంతానికి వస్తున్న గోపాలన్ అనే మరో అతన్ని పొడిచి, పోలీసు స్టేషనుకు వెళ్లి లొంగి పోయాడట—మార్చి 16న.

## సుప్రీం కోర్టులో హత్యా ప్రయత్నం!

గుళ్లో అనాచారాలు జరుగుతున్నట్టే సుప్రీంకోర్టులో ఓ దురాచారం జరిగింది. ఒకకేసు తీర్పుచదువుతున్న ఛీఫ్ జస్టిస్‌మీద కొకవ్యక్తి దుమికి ఆయన్ని కిందపడదోసి, ఆపక్కనున్న జస్టిస్ గ్రోవర్‌మీదకి వురికి ఆయన్ని తివాచీమీదికిలాగి కత్తితో మెడ వెనుక పొడిచాడుట ఆ వ్యక్తి. ఇదంతా త్రుటికాలంలో జరిగిందట. పదిహేను మందివున్న ఆ కోర్టులో ఒక న్యాయవాది ధైర్యంచేసి హంతకుడిమీదకు లంఘించాడనీ, అతనికి కొంతమంది సహాయానికి వచ్చారనీ తేలింది. మొత్తానికి గ్రోవర్‌కి ప్రాణాపాయం ఏమీలేదు.

*  *  *

ఆనంద్‌లో విద్యానగర్ రోడ్డుమీద మార్చి 11న ఒకశిశువు దారుణంగా మరణించింది. ఒకవ్యక్తి సైకిలుకి కట్టిన తొట్టిలో పదకొండునెలల శిశువును పడుకోబెట్టి, సైకిలు తొక్కుతున్నాడట. అతని సైకిలు ప్రమాదానికి గురయి, పసికందు రోడ్డుమీద పడడం, వెనుకనుంచి వచ్చిన లారీ ఆ పసికందుమీదనుంచి పోవడం రెప్పపాటులో జరిగాయట. ఆ పసిపిల్ల పిప్పి పిప్పయిపోయిందట.

## కంచే చేను మేస్తే?

ఒకకేసు సంబంధంగా ఆ విషయం ఏమయిందని కనుక్కోడానికి పోలీసు




స్టేషనుకువచ్చిన ఒక అబలను బలాత్కరించినందుకు (ఢిల్లీలో) ఒక సబ్ యిన్‌స్పెక్టర్నీ, మరో కానిస్టేబుల్ని పని నుంచి తొలగించి. విచారణ జరుపుతున్నారట.

*  *  *

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1. కవిత నిశ్చిత యోచనలు మరియు చింబిత్మైన ధ్యాసను మించి కావ్యమయ అంతర్ జ్ఞానాన్ని సూచించే సుందరతా/సత్యతా జ్యోతి ప్రాముఖ్యతను ప్రకటించును.

2. ఇతరుల గురించిన మన ఎరుకలో సానుభూతి వుండవలెను మన కృప/నిష్కపటత యొక్క మూలమందు అనురాగం వుండవలెను

3. మహా కవ్యాలకు/నాట్యాభినయాలకు కాలాతీతమైన మరియు స్థలాతీతమైన విశిష్టత గలదు.

4. భారతదేశపు సాంస్కృతిక/ఆధ్యాత్మిక సాంప్రదాయం మరియు కీర్తి దాని విస్తీర్ణ విశాలతను అందలి జన బాహుళ్య అపారతను చాలా అతిశయించిన శ్రేష్ఠత గలిగినవి.

5. మహాపురుషుల లోపములు/ ... యొక్క పరిజ్ఞానం సదాచార పరాయణతకు ప్రేరణగా పని జేస్తుంది. వాటిని జయించుటకు వారెట్లు యత్నించారో మనకు తెలుపుటవల్ల.

6. నిజంగా మహాపురుషుల జీవితం గురించి ఏదో గతిశీలం / కరుణామయం జరుగుతుంది.

7. స్వాభావికంగా భావప్రేరితం మరియు భావమయం/భాగ్యవర్ధిగా నడుటకు మనం మన పూర్వుల ప్రతిబింబిత కీర్తి జాలంలో చాలా దీర్ఘకాలం మరుగుపడియున్నాము.

8. సర్వజనాభిప్రాయం సర్వదా మరియు అధికాధికంగా ఇతర పూర్వ ప్రదేశాలకు పోల్చగా భారతదేశమందెక్కువగాను - కృతజ్ఞత లోపాటు వరకు/ప్రకోపం కూడా గలదు

9. యుద్ధములను నివారించుటకు ఒక్కటే మార్గంగలదు. హింసాపరిత్యాగం, లోభ ప్రతిబంధం మరియు మానవిక/నైతిక విలువల ఆధిక్యత యందు ...

10. మనుష్యుడుగా మానవ స్వాభావిక సిద్ధి ఆనందం/ఐక్యత

11. శరీరం కాదు, ఆత్మయే జ్ఞానార్హ నకు/ప్రేమించుటకు యోగ్యమైనది. ఆత్మ సౌందర్యమును గాక శరీరరూప సౌందర్యాన్ని ప్రేమించే మానవుడు ప్రశంసక లోపం గలవాడు.

12. భారతీయ తత్వజ్ఞాన దర్శనం సదా సజీవం, పుణ్యం, మరియు అర్థపూర్ణం/ఉద్దేశ్యపూర్ణం అయివున్నది.

13. మన భారతీయ వ్యవస్థ యొక్క దుఃఖదాయక అంశాలలో ఒకటి దేశం స్వయం నైతికత/బాధ్యతతో గూడిన జనులు వారుకలో హీనస్థితివల్ల నీచ ప్రవర్తకులగుదురు.

14. ఏ ఒక్క రాష్ట్రం/ధర్మం మానవజాతిపై పూర్తిగా గాని అధిక సంఖ్యాకం మీదగాని ఆధిపత్యాన్ని ఏమాత్రమూ చెలాయింప నేరదనే విషయం మానవేతిహాసమందలి నగ్నసత్యమై యున్నది.

15. సంపూర్ణ ఆధ్యాత్మిక మరియు బుద్ధి కుశల దృష్టిగల పుణ్యపురుషులు అరుదు/వివేకులు.

16. విజ్ఞానం మరియు వివేచనాశక్తి/ధర్మం జీవితంలో మహోత్కృష్ట విషయాలు.

17. విజ్ఞానం దేనినైనా ఋజువు చేయుచో మానవమనోస్థిరత/సమగ్రతను మరియు జడమైన మనోవికారములనధిగమించు శక్తిని ఋజువు పరచును

18. మహా ప్రేమ మౌనంగా/సాదాగా నుండ గలిగెను.

## No. 31: 18 CLUES

1. A poem signfies beyond a definite set of thoughts and images, a flash of **Beauty/Reality** to which poetic intuition points.
2. In our knowledge of others there should be sympathy; our **Charity/Sincerity** should have the root of affection
3. There is a timeless and spaceless quality about great **Classics/Histrionics**
4. India's **Cultural/Spiritual** heritage and glory far transcend the vastness of its area and the immensity of its population.
5. A knowledge of the **Defects/Doubts** of great men acts as an incentive to virtue, by showing us how they tried to overcome them.
6. There is something **Dynamic/Tragic** about the lives of the truly great.
7. Sentimental and **Emotional/Philosophical** by nature, we have basked for long in the reflected glory of our predecessors.
8. Public opinion always and more so in India than in other more sophisticated places — is easily grateful as well as **Forgetful/Fretful.**
9. The only way to prevent wars is to abjure violence, restrain greed and respect the supremacy of **Human/Moral** values
10. **Joy/Unity** is the fulfilment of one's nature as a human being.
11. It is the soul and not the body, which is worth **Knowing/Loving**, and he must be a poor admirer who loves the graces of the body, and not the beauty of the soul
12. Indian philosophy has all along been live, virile and **Meaningful/Purposeful**
13. It is one of the tragedies of our Indian system that low public standards are often blended curiously enough with a high sense of private **Morality/Responsibility.**
14. An outstanding fact of human history is that no one **Nation/Religion** has ever been able to extend its sway over the whole or even a majority, of the human race
15. Men with the gift of ful spiritual and intellectual vision are **Rare/Rational.**
16. Science and **Reason/Religion** are great things in life.
17. Science, if it proves anything, proves the **Sanity/Superiority** of the human mind, its capacity to rise above material temptations.
18. Great love can afford to be **Silent/Simple.**

గమనిక: పై క్లూలు భారతీయ గ్రంథకర్తల, పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు ఆఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లెటర్స్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును. రు. 6,10,000లు పైగా పంచబడినది.

## ఒకవారం విపరీతం

హరిద్వార్‌లో బదరీనాథ్ విగ్రహాన్ని ఎవరో తస్కరించుకు పోయారట. విగ్రహం వెయ్యి సంవత్సరాల క్రితందనీ, పురాణ ప్రసిద్ధి చెందినదనీ అంటున్నారు. అయితే విగ్రహం దొంగిలించిన వారినీ, వారు దొంగిలించిన విగ్రహాన్నీ పట్టుకున్నారు. విదేశాల మ్యూజియాల కోసం హిందూ పురాతన విగ్రహాలు దొంగిలించబడుతున్నాయని మన దేశపు తెలివితేటల శాఖ కనిపెట్టింది. అది ఏ దేశం !!

## పెళ్ళికి ముందు లైంగిక సంబంధం తప్పుకాదు!

'పెళ్ళికి ముందు లైంగిక సంబంధం' అనే విషయం మీద కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ విద్యార్థులు జరిపిన వోటింగులో 'లైంగిక సంబంధం తప్పు కాదు' అని తేలిందట. ఇది గాక విద్యార్థులలో సగభాగం మూడు శాతం, విద్యార్థినుల్లో ముప్ఫయి మూడు శాతం యీ రకమైన లైంగిక సంబంధాలు యిదివరకే కలిగి వున్నట్టు కూడా తేలిందట—




'మొట్టమొదటిసారి స్త్రీ పురుషులలో లైంగిక అనుభూతి' అనే విషయం మీద జరిగిన చర్చలో— నూటికి ముగ్గురు తాగిన మైకం వల్ల, రెండు శాతం కామోద్రేకం వల్ల యీ సంబంధం పెట్టుకుంటే ఇరవై తొమ్మిది శాతం మనఃపూర్వకంగానే యీ సంబంధం కలుగజేసుకుంటారని కూడా తేలింది.

— ఫెడరిక్

# మర్ఫీ ట్రాన్సిస్టర్ & 3 బహుమతులు

ఆఖరు ముగింపు తేది: 3—4—68.
సొల్యూషన్ భారత్‌జ్యోతిలో: 7-4-68
సొల్యూషన్ ఆంధ్రపత్రిక: 9-4-68.
ఫలితాలు: భారత్ జ్యోతిలో: 21-4-68.

LITQUIZ NO. 31

Rs. 35,000 FOR EVERY ALL-CORRECT

FIRST PRIZE RUPEES 17,500

RUNNERS-UP (UPTO 4 ERRORS) Rs. 9,000

MINIQUIZ (A) All-Correct only Rs. 2,000

MINIQUIZ (B) (UPTO 2 ERRORS) Rs. 5,500

RELIEF FUND - Rs. 1,000

MURPHY TRANSISTOR

* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను. • లిట్‌క్విజ్ పిక్లీ 10 సంచికలకు రు. 2/- పంపవలెను. * విగా ఎంట్రీలను తేది 2-4-68 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్ క్విజ్ నెం. 31 అధికార ఎంట్రీ ఫారము

ADDRESS LITQUIZ No 1, ALANKAR, BALARAM STREET, BOMBAY-7. (W B)

గమనిక: (1) ఒక్కొక్క వాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి. (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I. P. O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 31, బొంబాయి–7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 1 | Re. 1 | | 2 | Re. 1 | | 3 | Re. 1 | | 4 | Re. 1 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | BEAUTY | REALITY | 1 | BEAUTY | REALITY | 1 | BEAUTY | REALITY | 1 | BEAUTY | REALITY |
| 2 | CHARITY | SINCERITY | 2 | CHARITY | SINCERITY | 2 | CHARITY | SINCERITY | 2 | CHARITY | SINCERITY |
| 3 | CLASSICS | HISTRIONICS | 3 | CLASSICS | HISTRIONICS | 3 | CLASSICS | HISTRIONICS | 3 | CLASSICS | HISTRIONICS |
| 4 | CULTURAL | SPIRITUAL | 4 | CULTURAL | SPIRITUAL | 4 | CULTURAL | SPIRITUAL | 4 | CULTURAL | SPIRITUAL |
| 5 | DEFECTS | DOUBTS | 5 | DEFECTS | DOUBTS | 5 | DEFECTS | DOUBTS | 5 | DEFECTS | DOUBTS |
| 6 | DYNAMIC | TRAGIC | 6 | DYNAMIC | TRAGIC | 6 | DYNAMIC | TRAGIC | 6 | DYNAMIC | TRAGIC |
| 7 | EMOTIONAL | PHILOSOPHICAL | 7 | EMOTIONAL | PHILOSOPHICAL | 7 | EMOTIONAL | PHILOSOPHICAL | 7 | EMOTIONAL | PHILOSOPHICAL |
| 8 | FORGETFUL | FRETFUL | 8 | FORGETFUL | FRETFUL | 8 | FORGETFUL | FRETFUL | 8 | FORGETFUL | FRETFUL |
| 9 | HUMAN | MORAL | 9 | HUMAN | MORAL | 9 | HUMAN | MORAL | 9 | HUMAN | MORAL |
| 10 | JOY | UNITY | 10 | JOY | UNITY | 10 | JOY | UNITY | 10 | JOY | UNITY |
| 11 | KNOWING | LOVING | 11 | KNOWING | LOVING | 11 | KNOWING | LOVING | 11 | KNOWING | LOVING |
| 12 | MEANINGFUL | PURPOSEFUL | 12 | MEANINGFUL | PURPOSEFUL | 12 | MEANINGFUL | PURPOSEFUL | 12 | MEANINGFUL | PURPOSEFUL |
| 13 | MORALITY | RESPONSIBILITY | 13 | MORALITY | RESPONSIBILITY | 13 | MORALITY | RESPONSIBILITY | 13 | MORALITY | RESPONSIBILITY |
| 14 | NATION | RELIGION | 14 | NATION | RELIGION | 14 | NATION | RELIGION | 14 | NATION | RELIGION |
| 15 | RARE | RATIONAL | 15 | RARE | RATIONAL | 15 | RARE | RATIONAL | 15 | RARE | RATIONAL |
| 16 | REASON | RELIGION | 16 | REASON | RELIGION | 16 | REASON | RELIGION | 16 | REASON | RELIGION |
| 17 | SANITY | SUPERIORITY | 17 | SANITY | SUPERIORITY | 17 | SANITY | SUPERIORITY | 17 | SANITY | SUPERIORITY |
| 18 | SILENT | SIMPLE | 18 | SILENT | SIMPLE | 18 | SILENT | SIMPLE | 18 | SILENT | SIMPLE |

SEND FIRST TWO COUPONS & ENTER MINIQUIZ (A) FREE — No. 31 — SEND FOUR COUPONS & ENTER BOTH MINIQUIZ (A & B) FREE

MINIQUIZ (A) — 6 CLUES FREE COUPON

| | |
|---|---|
| BEAUTY | REALITY |
| CHARITY | SINCERITY |
| CLASSICS | HISTRIONICS |
| CULTURAL | SPIRITUAL |
| DEFECTS | DOUBTS |
| DYNAMIC | TRAGIC |

MINIQUIZ (B) — 12 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| EMOTIONAL | PHILOSOPHICAL | MORALITY | RESPONSIBILITY |
| FORGETFUL | FRETFUL | NATION | RELIGION |
| HUMAN | MORAL | RARE | RATIONAL |
| JOY | UNITY | REASON | RELIGION |
| KNOWING | LOVING | SANITY | SUPERIORITY |
| MEANINGFUL | PURPOSEFUL | SILENT | SIMPLE |

31 (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/-. ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/-. M. O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం............

CAPITAL LETTERS

NAME ..................................................

ADDRESS ..................................................

..................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

● నెం. 29 లో రు. 16,000 లు శ్రీ హెచ్. కె. మజ్ముందార్, నగర్వాడా, కలోల్ (గుజరాత్) గెలిచెను. ● లిట్ క్విజ్ నెం. 28 కి చెందిన బహుమతులు అన్నియు పంపబడినవి. ● లిట్ క్విజ్ 14 భాషలలో ప్రచురింపబడుచున్నది. 100 పైగా యేజెంట్లు గలరు. ఇండియా అంతటా అన్ని భాషలలో 100కి పైగా వార్తాపత్రికలలో అడ్వర్‌టైజమెంటు చేయబడుచున్నది.




### జరిగిన కథ

కవిరాజ ధన్వంతరీ నిలయం నరసయ్యగారికి ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు పెద్దపిల్ల కామేశ్వరి రెండవ పెళ్లివాడైన కేశవమూర్తితో కామేశ్వరికి వివాహమైంది కామేశ్వరి అభిరుచిని తెలుసుకున్న కేశవమూర్తి ఆమెని నళినితోపాటు చదువుకోడానికి కాలేజీకి పంపుతాడు మాధవ నళిని సన్నిహితుడు అతని అన్న రామనాధానికి కామేశ్వరిని పరిచయం చెయ్యమని నళినిని కోర్తాడు మాధవ కామేశ్వరి కాలేజీ మానేస్తుంది కామేశ్వరి ఏమయిందీ వివరంగా నళిని చెప్పనందుకు మాధవ నొచ్చుకుంటాడు కిళ్లీకొట్టు గవర్రాజు సుభద్రతో సంబంధం ఏర్పరచుకుంటాడు కేశవ కామేశ్వరిని రామనాధానికిచ్చి పెళ్లిచెయ్యాలని చూస్తాడు కాని ఆమె అంతర్యాన్ని గ్రహించి కుంగిపోతాడు భంగపడిన సుభద్రని కామేశ్వరి ఆదరిస్తుంది

## 12

'ముప్పయ్‌వేలు రూపాయలు కట్నం, కారూతో వప్పుకున్నారు చివరికి' అన్నాడు కేశవ!

ఆరోజు, వసుంధరా, నళినీ, కేశవ, ఒక పంక్తిన కూర్చున్నారు భోజనాలకి! కామేశ్వరీ, సీతమ్మ వడ్డిస్తున్నారు నళినికి వప్పుకోవటం ఏమిటో ఎందుకో తెలుసును. అయినా మాట్లాడలేదు

'విదేశాలకు వెళ్ళేవాడికి కారు ఇవ్వటం ఎందుకుటా!' అంది వసుంధర

'రెండేళ్ళు బెంగుళూరులో ఏదో కంపెనీలో పర్చేస్తాడట! అందుకని కారుకావాలట! అబ్బ! ఆనందమ్మ ఏం పేచీకోరుమనిషి బాబూ! ఆమె ప్రశ్నలకు జబాబులు చెప్పలేక నా ప్రాణం పోయిందనుకో వసూ!' అన్నాడు కేశవ.

'ఏం ప్రశ్నలేసిందావిడ?' కుతూహలంగా అంది వసుంధర

'ఇంతకాలానికి మళ్లీ పెళ్లి ఎందుకు చేసుకున్నారు? మీ కూతురుమీద మీకు అంత ఇష్టంలేదా ఏమిటి?' అన్నది ఆవిడ! అడగవలసిన ప్రశ్న అడిగారు అనుకుంది నళిని.

'నువ్వేం చెప్పావు?' అంది వసుంధర కామేశ్వరి చెవులు నిక్కుమన్నాయి.

'మతిలేక చేసుకున్నాను! మా అమ్మాయి మీద అపేక్ష లేక కాదు! నా ఆస్తిఅంతా నాతర్వాత మా అమ్మాయిదే! ఆ బెంగ మీరు పెట్టుకోనక్కరలేదు! అన్నాను' అన్నాడు కేశవ వసుంధర నవ్వింది. కామేశ్వరికి ఆమాటలు అర్థం అవలేదు! సీతమ్మకీ అర్థం అవలేదు.

'ఏదో అడుగుతారు! దానికేం! ఇంతకీ మనపిల్ల, డబ్బు నచ్చాయి! ఈ వేసంగిలో ముహూర్తం పెట్టించేస్తే అది ఒక ఇంటిదయిపోతే, నాకే బెంగా వుండదు' అంది సీతమ్మ నళినికి తన పెళ్లి ఇంత తొందరలో కుదురుతుందని కానీ, నరసింహమూర్తికి తను నచ్చుతానని కాని, నమ్మకం వుండేదికాదు! నరసింహమూర్తి, నళినికి నచ్చలేదు. కాని ఇప్పుడంతా కుదిరిపోయింది నళినికి పెళ్లిచేసుకోవాలనివుంది. కాని నరసింహమూర్తిని చేసుకోవాలని లేదు. నరసింహమూర్తి కళ్లల్లో ప్రేమానురాగాలు లేవు! ఒకవిధమైన విచిత్రమైన చూపులు చూస్తాడు! ఎదుటివారిని నఖశిఖపర్యంతం నిశితంగా పరిశీలిస్తాడు! ఆ చూపులు గుండుసూదుల్లా గుచ్చుకుంటాయి! నళినియొక్క శరీరం, ఆ చూపుతో తూట్లుతూట్లు పడిపోతుంది నళిని సుభావంగా ఆలోచించింది నళినికి ఇప్పుడు పెళ్లి అత్యంతావసరము అయికూర్చుంది! ఆమెలో గవర్రాజు ఆశ పెరుగుతూ పెరుగుతూ, ప్రాణంపోసుకునే స్థితికి వచ్చేసింది! అతన్నే పెళ్లిచేసుకుందుకు నళినికి ఇష్టంలేదు ఏదో ఈనాడు నాలుగుడబ్బులు వెనకవేసుకుని పెద్దమనిషిగా చెలామణి అయినా, ఓ అంటే, న అనలేని గవర్రాజుకి, ఆమె ఎక్కువ స్టేటస్, భర్తగా ఇయ్యలేకపోయింది! కిళ్లీకొట్టు వ్యాపారంతో పైకి వచ్చిన గవర్రాజు, ఆమెకి శరీరావసరాన్ని తీర్చటానికి పనికి వచ్చేడు. డబ్బుకోసం, నరసింహమూర్తి తనని పెళ్లిచేసుకుందుకు వప్పుకున్నాడు కనుక, ఆ తర్వాతకూడా, ఆ డబ్బుకోసమే తనని చచ్చినట్లు, మర్యాదగా చూస్తారు! అనుకుని తనని తనే వూరడించుకుంది నళిని

నళిని పెళ్లివార్త విన్న గవర్రాజు ఆశ్చర్యపోయేడు! జరగకూడని అవాంతరం ఏదో జరిగిపోతున్నట్లు బాధపడ్డాడు! సుభద్ర గర్భం ధరించిందని వినగానే, ఆమెని సంయమన శక్తిలేనిదానిగా భావించి ఈసడించుకున్నాడు! నళినికీ ఆపరిస్థితి కలుగుతూందని తెలియగానే కొండెక్కినంత సంబరపడినాడు! వారానికి రెండురోజులయినా, ఏదో వంకతో కేశవ ఇంటికి వచ్చిపోతూ వుండేవాడు!

నళిని కాస్సేపుకూర్చుని ఏదో పని వున్నట్లు లోపలికి వెళ్లిపోయేది! వంటిగా మాట్లాడటానికి అవకాశం ఇచ్చేదికాదు నళిని బయటికి ఎక్కడికీ పోయేదికాదు. పెళ్లి నిశ్చయమయింది కనుక సిగ్గుపడుతోంది ఎక్కడికన్నా వెళ్లటానికి! అనుకునేది సీతమ్మ! తీర్థయాత్రలకి వెళ్లకముందు, కామేశ్వరి, గవర్రాజువస్తే,

కాఫీ అదీ ఇస్తూ మర్యాదగా పలకరించేది! సుభద్రని కలిసినది మొదలు గవర్రాజుని చూస్తే లోపలికి తప్పుకుపోయేది! గవర్రాజు కూడా సుభద్ర ఇల్లువదిలి పారిపోయిందని విన్నది మొదలు కామేశ్వరి అంటే మాట్లాడ టానికి కొంచెం జంకుతున్నాడు! ఈ మధ్య గవర్రాజు, మునిసిపల్ కవున్సిలర్ కూడా అవటంతో తనకీ బయటవ్యవహారాలు ఎక్కువయిపోయాయి! ఆరోజు నళినితో మాట్లాడటానికి అవకాశం వచ్చింది గవర్రాజుకి.

'నిజంగా ఎల్లా ఒప్పుకున్నావు నళినీ పెళ్లికి!' అన్నాడు గవర్రాజు. నళిని గంభీరంగా నవ్వింది.

'గవర్రాజూ! నేను పిరికి పందను కాను! ఇల్లువదిలి పారిపోవటానికి సుభద్రలా గతిమాలినదాన్ని కాను! భర్తని వాకు చూసి పెట్టే హక్కు, మా వాళ్లకుంది. వాళ్ల మాటని నేనెందుకు కాదనాలి? వాళ్ల పరువు ప్రతిష్ఠలని ఎందుకు మంట గలపాలి?' అంది.

'ఇప్పుడు నీకు పరువు ప్రతిష్ఠ వుందనుకుంటున్నావా? హోటలు వినోదాలో నిన్నూ నన్నూ చూసిన వారెందరో వున్నారు! అంతకన్న ప్రతిష్ఠ నీ కడుపులోనే పెరుగుతోంది! ఇంకా ఎందుకీ దాగుడు మూతలు! నీకు చదువుకున్న డిగ్రీ ఒకటి వుందనుకో మిగిలిన విషయాలు దేనిలోనూ నేను మీకు తీసిపోను! అనవసరంగా మనకు కలగబోయే సంతానాన్ని అనాధని చేయకు!' అన్నాడు!

'నన్ను బెదిరించ నక్కర్లేదు! నీ సంతానాన్ని అనాధని చేయటం లేదు! జీవితాన్ని నీకంటే అధికంగా తీర్చి దిద్దగల వారినే ఎన్నుకున్నాను! నీవేం చెప్పినా ఎవరూ నమ్మరు! అనవసరంగా గొడవలు పెంచక హాయిగా నువ్వు కూడా ఎవర్నో ఒకర్ని పెళ్లిచేసుకో!' అని నవ్వింది. గవర్రాజుకి ఆశ్చర్యం వేసింది. సుభద్ర నెల తప్పినది మొదలు ఎంతో గాభరా పడుతూ తననే సర్వస్వంగా భావించుతూ తనని ప్రార్థించుతూ వుండేది. తను నళిని వ్యామోహంలో పడి గొప్పింటి అల్లుడుగా తను సంఘంలో నూతన జీవితం ప్రారంభించ దలచి సుభద్ర మాటలని పెడచెవిని పెట్టి క్రమంగా ఆమెకి దూరం అయి పోయేడు! తనకి దూరం అయిన సుభద్ర అవమానం



భరించలేక ఇల్లూ వాకిలీ వదలి, నిర్వాసులాలయిపోయింది! నళినికూడా సుభద్రలావే తనతో వివాహం తప్ప మరో గత్యంతరం లేదని తనని ప్రాధేయ పడుతుందని భావించాడు! కాని నళినికి ఆనందించే తత్వమేకాని, విచారించే తత్వంకాదని ఇప్పుడు తెలిసింది

'నళినీ మరోమాటు ఆలోచించు నీకు నాతో జీవితమే ఎక్కువ సౌఖ్యవంత మవుతుంది ఎప్పటికయినా నీ భర్తకి మన విషయం తెలిస్తే నీ జీవితం కంటక ప్రాయమవుతుంది! నీమీద నాకున్న ప్రేమ డబ్బు కోసం తాళికట్టేవాడికెల్లా వుంటుంది నళినీ!' అన్నాడు గవర్రాజు

'పదిమంది పెద్దల ఎదుటా తాళిగట్టేవానికే నేను ఏది చెప్తే అదే నానాల్గింగత్యంతరం పట్టుంది! నన్ను వంచించటానికి ప్రయత్నించకు గవర్రాజూ!' అంది నళిని నళినికేసి విభ్రమంగా చూడటం తప్ప మరేం అనలేక పోయేడు గవర్రాజు!

వారం పదిరోజుల గడిచాక నళిని పెళ్లి నరసింహమూర్తితో మహా వైభవంగా జరిగి పోయింది గవర్రాజూ మాధవ కూడా చేరు పెళ్లి విందులో చాలా ఆనందంగా పాల్గొన్నాడు మాధవ! రామనాథం కూడా భార్యతో సహా వచ్చేడు! బంధువులందరూ ఒక నెలరోజులు వరకూ తిష్ఠ వేసారు కేశవ ఇంట్లో కన్యాధార వసుంధరా ధర్మా, చేసారు కేశవ, కామేశ్వరీ చేయలేదు నందమ్మ పెళ్లిలో ఎలాంటి తగువులూ లేకుండా సంతోషంగా తిరిగింది

పెళ్లి జరిగిన నాలుగయిదు రోజులనాడు, ఒకరోజు గవర్రాజు వంటిగా డాబామీద పంచున్నాడు క్రింద కారు ఆగిన చప్పుడుకి క్రిందకు చూసాడు కామేశ్వరి ఆరునెల్ల చంటి పిల్లవాణ్ణి ఎత్తుకుని మెట్లెక్కటం కన్పించింది గబ గబా, క్రిందకు వెళ్లాడు గవర్రాజు

'చాలా కాలానికి మా ఇంటికి వచ్చేవు కామేశ్వరీ!' అంటూ పలకరించేడు హాలులో వున్న సోఫాలో కూర్చుంది కామేశ్వరి.

'ఇల్లు బాగుంది గవర్రాజూ!' అంది కామేశ్వరి.

'అష్ట ఐశ్వర్యాలూ సాధించాను! కామేశ్వరీ, కాని, నేను పొందాలనుకున్నది మాత్రం, పొందలేక పోయేను!' అన్నాడు

## వ. హాడ మ ళ్లా

గవర్రాజు

'పొందలేక పోతున్నానన్న తమకంలోనే పొంది తీరాలన్న కాంక్ష వృద్ధి చెందుతుంది గవర్రాజూ! వంటిగా ఎందుకుండి పోతావు? చక్కని పిల్లని చూస్తాను! పెళ్లిచేసుకో కూడదూ!' అంది కామేశ్వరి

'ఈ జన్మకి' ఆదొక్కటే తక్కువ నాకు! నిర్లిప్తంగా అన్నాడు.

'అంత వేదాంతం ఎందుకు గవర్రాజూ ధనం సంపాదించేవు సంఘంలో పలుకుబడి సంపాదించేవు ఒక ఆడపిల్ల నిన్ను తిరస్కరించినంత మాత్రాన్న నీ విలువ నీకు లేకుండాగా పోతుందా గతం విస్మరించు! భవిష్యత్తుకేసి ఆశతో ప్రయాణం చేయి!' అంది కామేశ్వరి

కామేశ్వరి ప్రశాంత వదనం చూసేసరికి గవర్రాజుకి గతమంతా తలపుకి వచ్చింది కామేశ్వరిని తను పెళ్లాడక తప్పదన్న నిశ్చయంతో వుండేవాడు ఆ అంచనా తారుమారయింది! ఆ బాధలో సుభద్రని లొంగదీసుకుని కొంత తృప్తి ననుభవించి, నళిని వ్యామోహంలో పడ్డాడు! నళిని తనని అనుభవించి కూడా తిరస్కరించ గలిగింది!

అకస్మాత్తుగా కామేశ్వరి చేతుల్లో ఆడుకుంటూన్న పసివాడిమీద దృష్టిపడింది గవర్రాజుకి

'ఈ కుర్రవాడు ఎవరు కామేశ్వరీ ముద్దుగావున్నాడు?' అన్నాడు

'బాగున్నాడా! కావలిస్తే తీసుకో!' అంది కామేశ్వరి!

'ఎవరిపిల్లవాడు కామేశ్వరీ నీకు వాణ్ణి దానం చేయటానికి హక్కువుందా?'




అన్నాడు గవర్రాజు.

'దాన విక్రయాది సర్వాధికారాలతో వీడు నా పాలబడ్డాడు గవర్రాజూ నేను వీణ్ణి ఏమి చేసినా, అడిగేవాళ్లెవరూ లేరు' అంది కామేశ్వరి

గవర్రాజుకి జాలివేసింది ఆ పసివాడిమీద ఈ లోకంలోకి వచ్చి రాగనే, అతను అనాథుడై పోయేడు తనకి తల్లిదండ్రులు పోగానే, తను తన అన్నతమ్ముల చేత ఎంతగా అవమానితుడైనాడో పొట్ట చేత పట్టుకుని ఎన్నెన్నివూళ్లు నిర్వ్యాపారంగా తిరిగాడో గుర్తుకు వచ్చింది గవర్రాజుకి తనకింత డబ్బువుంది ఇలాంటి అనాథ బాల బాలికలనుచేర్చి పెంచి, విద్యాబుద్ధులు నేర్పించి, లోకంలో వాళ్లు బతుకుతు వాళ్లు బతక గలిగేట్టు చేస్తే తన డబ్బు సార్థకమవుతుంది—అనుకున్నాడు గవర్రాజు.

'అయితే నాకిచ్చెయ్యండి బాబుని నేను పెంచుకుంటాను ఇంకా ఇలాంటి బాల బాలికలు కనపడితే నాకియ్యండి నేను ఒక అనాథశరణాలయం స్థాపించదల్చుకున్నాను!' అన్నాడు గవర్రాజు

'అలాగే! నీవు శరణాలయం స్థాపించటం చాలా సంతోషం! నీలాంటి సహృదయులు నలుగురు కూడితే ఈ లోకంలోని అనాథ పిల్లలు అందరూ అదృష్టవంతులౌతారు గవర్రాజూ కాని ఆ పిల్లలందర్నీ చేరదీసి ఆడించి, పాడించి పెంచటానికి ఆయాలు కావద్దూ నాకు వీడి అమ్మని తెలుసును పాపం అపిల్ల జీవనభృతికోసం తంటాలుపడుతూంది నీ శరణాలయంలో ఉద్యోగం ఇచ్చేవంటే ఆనందపడుతుంది ఏం గవర్రాజూ, ఆమెని రేపు పంపించమంటావా?' అంది కామేశ్వరి

'తప్పకుండా పంపించు!' అంటూ కామేశ్వరిచేతుల్లోని బాబుని ఎత్తుకని ముద్దులాడేడు గవర్రాజు వాడిని ఎత్తుకోగానే, అతని శరీరం, నూతన అనుభూతితో పులకించిపోయింది తను ఇన్నాళ్లనించీ ఎదురుచూస్తున్న ప్రేమ లభించినట్లయింది గవర్రాజుకి

కామేశ్వరి ఇల్లంతా తిరిగిచూసింది చాలావిశాలంగా అందంగా కట్టబడివుంది గవర్రాజు మేడ

'మా మేడకన్న, మీ మేడ చాలా పెద్దది గవర్రాజూ' అంది కామేశ్వరి.

## మూడుముళ్లూ

'వీా అక్క మేడ పెద్దదో, మనమేడ పెద్దదో చూద్దువుగాని' అని తను సుభద్రతో అన్నమాట జ్ఞాపకం వచ్చింది గవర్రాజుకి.

'పాపం సుభద్ర!' అనుకున్నాడు గవర్రాజు

'ఇంక వెళ్ళొస్తాను బజారుకు పోతూ ఇలా వచ్చేను మా అల్లుడికీ, అమ్మాయికీ బట్టలు తీయాలన్నారు ఆయన'' అంటూ పిల్లవాడికోసం చేయిచాపింది కామేశ్వరి

'ఇక్కడ ఉంచుతానన్నావుగా' అన్నాడు గవర్రాజు.

'ఆయా లేకుండా నీవేం పసుదాయిస్తావు వాడిని? రేపుఆయాతో పంపుతాలే!' అంటూ కామేశ్వరి వాడిని తీసుకొని వెళ్ళిపోయింది ఇల్లంతా మళ్ళీ శూన్యత ఆవరించింది 'కామేశ్వరి ఇంట్లో వున్నంతసేపు ఎంత కలకల లాడిపోయింది ఇల్లు? ఇల్లాలూ పిల్లలూ లేని జీవితం ఏం జీవితం? ఈ డబ్బా పలుకుబడి ప్రతిష్ఠ, ఎవరికోసం? ఎవరు ఆనందించనూ?' అనుకొని ఖేద పడ్డాడు గవర్రాజు.

'అనవసరంగా లేనిపోని ఆశకు పోయి నేను తప్ప గతిలేదని మొత్తుకున్న సుభద్రని తరిమివేసాను! ఈ నళిని డెయ్యం నా సర్వస్వాన్ని దోచింది నన్ను వెర్రివుడ్ని చేసి తను పెద్ద ఉత్తమ ఇల్లాలుగా కులుకుతోంది!' అనుకుని ఉద్రేకపడ్డాడు గవర్రాజు.

నళిని బెంగుళూరు వెళ్ళిపోయింది చుట్టాలు అందరూ ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయేరు వసుంధర కూడా తన అత్తవారింటికి వెళ్లబోతూ,

'కామేశ్వరీ మళ్ళీ నీ కొడుకు బాలసారెకు వస్తాను! జ్ఞాపకం వుంచుకుని పిలుస్తావు కదూ!' అంటూ పరిహాసం చేసింది.

'నా కొడుకు బాలసారెకన్న ముందు మేనకోడలి కొడుకు బాలసారెకు రావాలి మీరంతా!' అంది కామేశ్వరి వసుంధర నవ్వింది. వసుంధరకి మేనకోడలి సంగతేమీ తెలియదు. అందుకని కామేశ్వరి పరిహాసాన్ని ఆశీస్సుగా భావించింది.

ఆ రాత్రి కేశవ, కామేశ్వరితో అన్నాడు.

'నళిని బరువుతీరి పోయింది కామేశ్వరీ! ఇంక మనరోజు లెలాగడిచినా ఇబ్బంది లేదు!'

కామేశ్వరి ఏమీ అనలేదు ఆమె మవునం చూసి అన్నాడు కేశవ!'

ఏమలా వున్నావు? కామేశ్వరీ! వంట్లో కులాసాగా లేదా!' ఆత్రతగా అడిగాడు కేశవ.

'కాదు! ఒకటి అడగాలనుకుంటున్నాను!' అంది కామేశ్వరి

'ఒకటేమిటి కామేశ్వరీ! లక్ష అడుగు! నీకా హక్కు వుంది!' అన్నాడు హార్దికంగా కేశవ

'అత్తగారు నన్ను తీర్థయాత్రలు పంపించారు ఎందుకో నీకు తెలుసా?' అంది అతనికేసి చూడలేక తల దించుకుంది.

'నాకు తెలీదు! పెద్దావిడ ఒక్కరూ ప్రయాణంచేయలేక నిన్ను సాయం తీసుకు వెళ్లిందనుకున్నాను ఇంతకీ అసలు సంగతేమిటి?' అన్నాడు కేశవ.

'మనకి పిల్లలు కలగటం లేదని!' అంటూ ఇంకా తల దించుకుంది కామేశ్వరి. కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయేడు కేశవ. అతను ఎంతకూ మాట్లాడకపోవటం చూసి తల పైకెత్తి చూసింది కామేశ్వరి కేశవ కన్నుల్లో అస్పష్ట భయాందోళనని గుర్తించ కలిగింది కామేశ్వరి అతని కన్ను కొలకుల్లో నీరు క్రమక్రమంగా కూడుకొని చెంపల మీదకి ముత్యాలు ముత్యాలుగా జార బోతూంది.

'నీకు పిల్లలంటే ఇష్టమా కామేశ్వరీ!' గద్గదికంగా అడిగాడు. కామేశ్వరి లజ్జా సంకోచాలతోటి,

'తల్లినై పిల్లలని లాలించి పోషించి పెంచుకోవాలనే కోరిక ఆడవాళ్లకి సహజమైనది. ప్రకృతిమాత వరం కదా! మీ రెందుకు అలా అడిగారు!' అంది.

'ప్రతి స్త్రీకి తన పిల్లలమీద స్వార్థ ప్రేమ మిక్కుటంగా వుంటుంది కామేశ్వరీ. నళినిమీద నాకన్న మా రాజీకే ఎక్కువ ప్రేమ వుండేది కాబోల్ను మరణశయ్య మీద రాజీ ఒక కోరిక కోరింది 'మీ ఆనందానికి అడ్డు చెప్పను. మీరు లక్షణంగా మరో పెళ్ళి చేసుకోండి కొత్త భార్యతో సుఖసంతోషంగా కాలం గడపండి. కాని నా నళినిని మాత్రం దుఃఖపడేలా చేయకండి ఆ పిల్లని జాగ్రత్తగా పెంచండి. నా రక్తం పంచుకున్నబిడ్డ అవే స్మృతి

మీరు ఏ క్షణంలోనూ మరువకండి. అది చాలు నా ఆత్మశాంతికి' అంది ఆమె చేతిలో చేయి వేసాను అందుకని, అందు కనే అమ్మతోనూ, వసుతోనూ ఆఖరికి ప్రాణస్నేహితులకి కూడా తెలీకుండా ఆపని చేసాను. నన్ను క్షమించు కామేశ్వరీ! నీకు తీరని ద్రోహం చేసాను. నీకు చెప్పాలను కుంటూనే చెప్పలేకపోయేను. అందుకనే నీకు మరోపెళ్ళి చేయటానికి అంగీక రించాను. నీ లేతముఖంలోని కోరిక నాకు తెలుసు కామేశ్వరీ! కాని నీ జీవితాన్ని నీవే కాలదన్నుకున్నావు!' అన్నాడు కేశవ.

'అంటే! నా కర్థం అవలేదు! దయ యుంచి వివరంగా చెప్పండి!' అంది కామే శ్వరి. ఆమెకి అంతా అయోమయంగా వుంది. అతను చెప్పినదేమీ ఆమె కర్థం కాలేదు.

'అప్పట్లో మళ్ళీ పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేకపోయినా రాజీ చనిపోయిన నాలుగు నెలలకే నేను పిల్లలు పుట్ట కుండా ఆపరేషన్ చేయించుకున్నాను!' అన్నాడు కేశవ.

కామేశ్వరి మాట్లాడలేదు. మాట్లాడ టానికి ఆమెకేమీ మాటలు దొరకలేదు. ఆమె జీవితం సంపూర్ణమైంది. కాని అసంపూ ర్ణంగానే మిగిలింది! కేశవ తనని పూర్తిగా అన్యాయం చేయలేదు అవకాశం ఇచ్చాడు! కారణం తెలీని తను ఆ అవకాశం వదులుకుని, పెద్ద పతివ్రతలా నిల బడింది. ఇప్పుడేం చేస్తే బాగుంటుంది? ఏం చేయక్కర్లేదు! ఈ మూడుముళ్ళతో ఏనాడో తనని తను బంధించుకొంది! స్వయం బద్ధురాలు తను!

ఏడ్చి పెద్దగొడవ చేస్తుందేమో అను కొన్న కామేశ్వరి నిస్తబ్ధురాలుగా వుంటం చూసి, కేశవ ఆందోళన చెందాడు. ఆ మౌనంలోని అర్థాల తెలుసుకో లేనంత మూర్ఖుడు కాదు కేశవ! ఆమె తల నిమురుతూ, గాఢంగా తన హృదయానికి హత్తుకున్నాడు కామేశ్వరిని కేశవ!

* *

'కామేశ్వరీ! నీవు దేవతవి! నేను పిచ్చి వ్యామోహంలో కాలదన్నుకున్న సుఖ శాంతుల్ని, నీవు తిరిగి ప్రసాదించేవు! సుభద్ర, బాబులతో నా ఇల్లు నూతన కాంతితో వెలిగి పోతోంది కామేశ్వరీ! సుభద్ర ముందు నేను సిగ్గుపడ్డాను! ఆమె శాంత సౌజన్యాలలో నీ చెల్లెలే! నా తప్పు లన్నీ క్షమించి నన్ను స్వీకరించింది! నీకు వీలున్నప్పుడు, నీ చెల్లెలింటికి వచ్చి మా ఆనంద జీవితం చూసి సంతోషించాలని అభ్యర్థిస్తున్నాను! మీ అమ్మగారికి నాన్న గారికీ, కూడా ఈ శుభవార్త వ్రాసేను

నీరాకకు ఎదురు చూస్తుంది నీ చెల్లెలు

ఇట్లు — గవ్రరాజు.

'వాళ్ళకి మూడుముళ్ళ బంధం లేక పోయినా భావ బంధం వల్లనే సంసార్లు అయినారు!' అనుకొంది కామేశ్వరి.

సీతమ్మ మటుకు కామేశ్వరి చేత వ్రతాలు చేయించటం మానలేదు! కామేశ్వరి అత్తగారిమాట కేనాడూ ఎదురు చెప్పలేదు!

'ఇంకా భగవంతుడి దయ రాలేదు! మా కోడలు పిల్లమీద. దానికడుపున ఒక్క కాయకాస్తే చూసిపోవాలని వుంది!' అంటూ సీతమ్మ వచ్చిన ప్రతి బంధువుతోనూ చెబ్తూంటే, కామేశ్వరి, గాజుకళ్ళతో వినేది ఆ అవస్థలో ఆమె అచేతనురా లయ్యే పాపం కామేశ్వరి! **(అయిపోయింది)**



# వారఫలం

**5-4-68 శుక్రవారం మొదలు**
**11-4-68 గురువారం వరకు**

**మేషం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకూలంగా వుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి

**వృషభం:** వ్యాపారరీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— బంధువులకు సహాయం చేస్తారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో ఆగిపోయిన వ్యవహారాలను ఇప్పుడు పూర్తి చేయగలరు ప్రయాణాలు ఫలిస్తాయి ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి విజ్ఞాన సాంగత్యం లభిస్తుంది రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్త్రీలకు- వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు

**కర్కాటకం** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**సింహం :** వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు బాగా ఉంటాయి కాని వారం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో శ్రమకు గురి కాగలరు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. ముమ్ముందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది అధిక వ్యయం జరుగుతుంది.

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది! వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి, స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును అలంకార వస్తువులు కొంటారు.

**తుల** వృత్తిలో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది! కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృశ్చికం :** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే కొత్త సమస్యలు యేర్పడతాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు** భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడరాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది స్త్రీలకు—సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది అనుకూలమైన వార్తలను వింటారు.

**మకరం** వృత్తివ్యాపారాల్లో మీశ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కుంభం :** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల ముమ్ముందు కూడా ఉపయోగం ఉంటుంది వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. సాహిత్య కళారంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు.

**మీనం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడుతాయి. స్త్రీలకు—బంధువులకు సహాయం చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్



# లేచింది మహిళాలోకం-రష్యాలో

ప్రతి సంవత్సరం మార్చి 8 వ తారీకు నాడు 'ప్రపంచ మహిళాదినం' జరుపుతారు ఈ పండుగ కమ్యూనిస్టు దేశాలలో అధికంగా జరుపుతారు కొన్ని పాశ్చాత్య దేశాలలో ఇది శాసనం ప్రకారం కూడా పర్వదినం.

మార్చి 8, 1910 లో క్లారాజెటిన్ అనే జర్మన్ వనిత, ఆ తేదీన జరిగిన రెండవ ప్రపంచ మహిళా సమావేశంలో, మార్చి 8 ఏటా ప్రపంచ మహిళాదినంగా పరిగణించాలనే ప్రతిపాదన చేసింది ఆమె ప్రతిపాదన ఏకగ్రీవంగా ఆమోదించటం జరిగింది అయితే ఈ సంఘటనకి పెద్ద ప్రాముఖ్యత లభించలేదు

రష్యాలో విప్లవానంతరం దానికి మంచి ప్రాముఖ్యత దొరికింది. కాగితంమీద ఉండే స్థానం ఒకటి, యదార్థంగా ఉండే స్థానం వేరొకటిగా ఉంటుంది ఏ విషయంలో నయినా. మహిళా పునరుద్ధరణ ఉద్యమం విషయంలోనూ అంతే. రష్యాలో పరిస్థితి ఎలా ఉంది? ఈ దేశంలో స్త్రీలు అన్ని రంగాలలోనూ పురుషులతో సరిసమానంగా పోటీ చేస్తున్న సంగతి అందరికీ తెలిసి, దే అయినప్పటికీ ప్రభుత్వం కూడా తన కర్తవ్యాన్ని వదలకుండా ఎప్పటికప్పుడు మరింత అవకాశం కల్పిస్తూ ఉంటుంది మహిళాలోకానికి ఉదాహరణకి 'మినిస్టర్, కాస్మోనాట్, డెప్యూటీ, ఎకాడెమిక్' అనే ఉద్యోగాలలో మగవారినే వేసేవారు నేడు వనితలకీ ఈ ఉద్యోగాలు ఇస్తున్నారు.

రష్యాలో ఏదయినా ఒక పట్నం తీసుకుంటే, అక్కడ కిరాణా అంగళ్ళు, సెలూన్‌లు, సినిమా హాళ్ళు, హోటళ్ళు మొదలైనవన్నిటినీ ఆడవారే నడుపుతూ ఉంటారు; శరీరబలానికి ప్రాముఖ్యతలేని పనులన్నిటిలోనూ వనితలకి మంచి అవకాశాలు లభిస్తాయి ఇక ఆఫీసుల సంగతి సరేసరి.

ఉపాధ్యాయ వైద్య వృత్తులలో స్త్రీల సంఖ్య చాలా ఎక్కువ– నూటికి డెబ్బై పాళ్ళు వీరేనని అంచనా.

ఇక వ్యవసాయ రంగం సంగతి తీసుకుందాము సోవియట్ యూనియన్‌లో ఈ రంగంలో 53 శాతం ఆడవారేట అందరూ విద్యావంతులేట వెటరరీ డాక్టర్లలో కూడా వీరి సంఖ్యే అధికంట. గ్రామ సభాధ్యక్షులలో 40 శాతం వనితలే అని లెక్కలు చెప్తాయి

ఇంతదాకా ప్రభుత్వం ఏర్పరిచే వివిధ బహుమతులని 11,50,000 మంది మహిళలు అందుకున్నారుట వీరిని సోష లిస్టు శ్రమదాన నాయికలంటారు ఇక్కడ.

పురుషులతో సమానత్వానికి పోటీ పడే విధానాలలో సోవియట్ స్త్రీలు ప్రపంచానికే మార్గదర్శను లనవచ్చు

—టి ఎస్. సుబ్రహ్మణ్యం ●

# డాక్టర్ కబుర్లు

## ప్రాస్ట్రేట్ ఇబ్బందులు

సాధారణంగా (అమెరికాలో) 60 సంవత్సరాల వయబడ్డవారికి ప్రాస్ట్రేట్ గ్రంధి పెద్దదవుతుంది ఇది జరిగినప్పుడు మూత్ర విసర్జన విధానంలో మార్పు వస్తుంది మూత్రం ధార వేగం తగ్గుతుంది. అంతేకాక, ఈ ఇబ్బంది ఉన్నవారు రాత్రివేళల లేచి తరుచు మూత్రవిసర్జనకి వెళ్ళవలసి వస్తుంది

ఈ 'రోగం' వచ్చినప్పుడు డాక్టరు పరీక్ష అవసరం ఇది చాలా తేలిక పరీక్షకూడా,

ఒకొక్కసారి ప్రాస్ట్రేట్ గట్టిపడవచ్చు, లేదా ఉబ్బవచ్చు. ఉబ్బినప్పుడు డాక్టరు 'మాలిష్'తో ఆ పరిస్థితిని చక్కపెట్టగలడు. అప్పటికీ తగ్గకపోతే ఆపరేషన్ అవసరం.

ఈ ఆపరేషన్‌తో వ్యాధి గుణాలు పూర్తిగా పోతాయి ఒక ప్రముఖ వ్యక్తి తరుచు మూత్ర విసర్జనకి వెళ్ళవలసి వస్తున్నదని ఎక్కడా విందులకి వెళ్ళేవాడు కాదుట ఈ శస్త్రచికిత్స



చేయించుకున్న తర్వాత అతని పరిస్థితి బాగా చక్కబడింది

హెచ్ ఎల్ హెర్షెన్‌సోన్

(కాపీరయిట్)






# కళ్యాణ శోభ

ఉదయం తొమ్మిదిగంటల వేళ. ఆఫీసుకి పోవలసిన భర్తకు, బడికి పోవలసిన పిల్లలకు భోజనం సిద్ధం చేస్తున్నది శారద. గుమ్మంలో రిక్షా ఆగింది. నరసింహమూ భార్యా దిగారు.

'మీరెప్పుడు వచ్చారు? కూర్చోండి!' అంటూ పలకరించాడు సత్యన్నారాయణ.

'కూర్చోడానికి వ్యవధిలేదు వెంటనే వెళ్ళాలి' అన్నాడు నరసింహం.

'ఏమిటి సంగతి?' అని వాళ్ళవైపు ఆశ్చర్యంగా చూసాడు సత్యన్నారాయణ.

నరసింహం భార్య కట్టుకొన్న పట్టు చీర, పట్టురవిక, ముఖంనిండా పౌడరు, సెంటు వాసనలు, చేతిలో సిల్కురుమాలు, అందులో వెండి కుంకుమ భరిణ చూడగానే అందుకుంది శారద. 'పెళ్ళివారిలాగ వున్నారండీ!' అని.

'ఎవరికి పెళ్ళి?' అని అడిగాడు సత్యన్నారాయణ.

'మా చిన్న చెల్లెలు సరస్వతికి.'

'ఎప్పుడు? ఎక్కడ? ఆ సంగతి ఇంకా చెప్పవేమి?'

'ఇక్కడే ఇప్పుడే. ఆ సంగతి చెప్పడానికే ఇప్పుడు వస్తి. ఇవాళే 10-30 గంటలకి ముహూర్తం. నువ్వూ వదినా పిల్లలూ తప్పక రావాలని అని అన్నయ్య చెప్పమన్నాడు. వెంటనే బయలుదేరాలి మరి.' అన్నాడు నరసింహం.

'ఇదేమిటి విచిత్రంగా వుందే. ఇక్కడ వుండిన నాకు కూడా ఈ సంగతి ఇంత వరకు తెలవకపోవడానికి కారణం ఏమిటి, మీ అన్నయ్య?'

'అన్నయ్యకి మాత్రం తెల్సా ఏమిటి? సంబంధ నిశ్చయించింది నేను. వారం రోజులయింది. పెళ్ళికొడుకు మా ఆఫీసులోనే అకౌంటెంటు. వాళ్ళు అడిగినదానికి .. ఇష్టపడి కొంత అడ్వాన్సు కూడా ఇచ్చేసి వచ్చేసాను. వాళ్ళు తొందరలో ముహూర్తం పెట్టుకున్నారు. చూడబోతే వారం తిరగకుండానే ముహూర్తం కుదిరింది. మొన్నసాయంత్రమే వచ్చి అన్నయ్యకీ సంగతి చెప్పాను.

మిగతా ఏర్పాట్లు అన్ని చెయ్యమని, పెళ్ళివారు వచ్చి గుమ్మంలో కాలుపెట్టే వరకూ ఎలాంటి ఏర్పాట్లు చెయ్యవన్నాడు. వాళ్ళు నిన్న సాయంత్రం రైలు దిగారు. రాత్రికి రాత్రి ఏర్పాట్లు అన్ని జరిగాయి.

అప్పటికి మిమ్మల్ని పిలవడానికి వదినా మా ఆవిడా కూడ వచ్చారు. కానీ మీ ఇల్లు కనుక్కోలేక పోయారు.'

'అవునండీ ..ఆ రిక్షావాడు ఒక చోటు కని చెప్తే మరోకచోటుకి తీసుకొని పోయాడు అర్థరాత్రివరకు వెతికి ఇల్లు తెలుసుకోలేక తిరిగి వెళ్లిపోయాం' అన్నది నరసింహం భార్య

'ఇప్పుడయినా అడుగడుగునా అడుగుతూ వస్తూనే ఇక్కడికి చేరగలిగాను.' అని ముగించాడు నరసింహం.

'ఈ మహాపట్నంలో వుండే చిక్కే అది. ఒకసారి చూసిన ఇల్లయినా మళ్లీ తెలుసుకోవడం అంటే అసాధ్యమే' అన్నాడు సత్యన్నారాయణ.

'ఇంక ఏమాత్రం ఆలశ్యం చెయ్యొద్దు బయల్దేరండి' అన్నాడు నరసింహం.

'మేమూ మీ వెంట వెంట వస్తున్నాం' అన్నాడు సత్యన్నారాయణ

శారద ముఖాన్ని బొట్టుపెట్టి వెళ్లిపోయారు వాళ్లు

సత్యన్నారాయణ, పిల్లలూ పెళ్లి వారింటికి చేరుకునేసరికి పదిగంటలయింది పెళ్లిపందిరి బజంత్రీలతో మారుమ్రోగుతూంది అప్పుడే వధూవరులు మంగళాస్నానాలుచేసి పీటలమీద కూర్చొన్నారు శుభముహూర్తం సమీపిస్తున్నది రామ్మూర్తి, భార్యా కంకణాలు కట్టుకొని కూర్చున్నారు నరసింహం వచ్చిన వాళ్లందరినీ ఆదరించి కూచోబెట్టున్నాడు రామ్మూర్తి సత్యన్నారాయణను ఒకమారు పలకరించాడు ముందు ఫలహారాలు చేసి మరీ కూర్చోమన్నాడు

ఫలహారాల గదిలో కనిపించింది పార్వతి పార్వతి రామ్మూర్తి పెద్ద చెల్లెలు ఏడో ఏటనే దానికి పెళ్లికావడం, ఏడాది తిరిగి కుండానే ఆ మొగుడు కాస్తా చనిపోవడం జరిగింది పాతికేళ్ల కిందటిమాట ఆ తరువాత రాఘవయ్యగారి కుటుంబం చితికిపోవడం, ఆ తరువాత ఆయన పోవడం జరిగాయి అప్పట్లో దానికి మళ్లీ పెళ్లిచెయ్యలేకపోయారు ఆతరవాత రామ్మూర్తి ఉద్యోగం చేస్తూ నాలుగు రాళ్లు సంపాదిస్తూ, తమ్ముళ్ళకి, చెల్లెళ్లకీ చదువులు చెప్పించి ప్రయోజకుల్ని చేశాడు కాని పార్వతికి మాత్రం మళ్లీ పెళ్లి చెయ్యలేదు సీతారామమ్మ చాదస్తం రామ్మూర్తికి కూడ పట్టుకుంది కాబోలు! అప్పుడే ముప్పయి ఏడు ఏళ్లు నెత్తిన పడ్డాయి పార్వతికి తలలో నెరిసిన జుత్తు మెరుస్తూంది ముఖాన్ని బొట్టులేకుండ శరీరం మీద ఇంకే ఆభరణమూ లేకుండా సాదా చీరతో కన్పించిన పార్వతిని చూడగానే 'అన్యాయం జరిగింది' అనిపించింది సత్యన్నారాయణకు.

'ఏమే పార్వతీ ఏం చేస్తున్నావూ ?' అని అడిగాడు

'ఏముందీ, ఏదో మానవ సేవ సర్వోదయ సంఘంలో చేరాను. చెడ్డదాన్ని అనిపించుకోకుండా ఇలా బ్రతుకుతున్నాను.'

'ఎక్కడ పని ?'

'మారు మూల గ్రామాల్లో.'

'అయితే ఇక్కడికి యెలా రాగలిగావు ఈ వేళకి సరిగ్గా ? ఊళ్లో వున్న నాకే తెలీదే యింతవరకూ ?!'

'నాకు మాత్రం తెల్సా ఏమిటి ? రెండు రోజుల క్రితం యేదో పని మీద ఇక్కడికి వస్తే వీళ్ళు ఉండి పొమ్మన్నారు ఈ ఏర్పాటు వుందని'

'అమ్మా, సరోజ, శివుడూ కనిపించరేం, వాళ్లకీకబురు అందలేదా ?'

'వాళ్లకీ నిననే టెలిగ్రాము వెళ్లింది అందిన వెంటనే రాత్రిబండికి బయలుదేరితే ఈపాటికి రావలసినవాళ్లే తప్పితే రాత్రికి వస్తారు'

'సరోజ ఏం చేస్తూంది ? దానికి పెళ్లి అయిందా ?'

'లేదు అది ఉద్యోగం చేస్తుందిట పెళ్లి అక్కర్లేదు అన్నదట అందుకే చిన్నదానికి సరస్వతికి పెళ్లి యేర్పాటు చేశారు'

కుశల ప్రశ్నలతో ఫలహారాలు పూర్తి చేసుకొని బయటకొచ్చాడు సత్యన్నారాయణ శారద అప్పుడే పెళ్లివారితో కలిసిపోయింది. పళ్లేలు పట్టుకుందికి సహాయపడుతోంది పిల్లలు భజంత్రీల వాళ్లదగ్గరకు వెళ్లి కూర్చున్నారు మగ పెళ్లివారి తరపున పెళ్లికొడుకు తండ్రి, మేనమామ తప్పిస్తే తక్కిన అందరూ క్రొత్తవారు. పెళ్లికొడుకు స్నేహితులు. పెద్దాయనతోనే బంధుత్వం తెలుపుకున్నాడు సత్యన్నారాయణ. రామ్మూర్తి తనూ పెత్తండ్రి పినతండ్రి కొడుకులు. ఇరవై యేళ్లు వచ్చేవరకు ఒక చోటనే వుండేవారు, ఆ తరువాత ఉద్యోగరీత్యా విడిపోయారు. మళ్లీ ఈనాటికి యిక్కడ కలుసుకోవడం సంభవించింది— ఇలా నడుస్తూంది సంభాషణ. ఇంతలో 'మరదిగార్ని ఇలా ఒక్కసారి రమ్మనండి' .అని కబురు వస్తే వెళ్లాడు సత్యన్నారాయణ

'మీరు యిప్పుడే రైలు దిగి వచ్చారని పెళ్లివారితో చెప్పాం ఆ మూడు ముళ్లూ పడేవరకూ ఏ మాటా అనకుండా వుండడం ఎందుకేనా మంచిది' అని వదినగారి శాసనం.

'అబద్ధం యెందుకు ఆడాలి? తను ఆడిన మాటల్లో తప్పేముంది ?' తెలిసింది కాదు సత్యన్నారాయణకు.

మంగళసూత్రధారణం అయిపోయింది తరువాత కార్యక్రమం వెంటనే ఆరంభించాడు పౌరోహిత్యుడు

కట్నం ఐదువేలు పైచిలుకే అని తెలుసుకున్నాడు సత్యన్నారాయణ

ఇంతకట్నం ఎందుకు ఇస్తున్నాడో రామ్మూర్తి ? తనదగ్గర వుంటేమాత్రం ? తనకు మాత్రం పిల్లకి కూతుళ్లు లేరా ?

రాత్రికి కార్యానికి ఏర్పాట్లు జరగాలి. సిల్కువుటాన్లు, ట్యూబులైట్లు, పువ్వులూ, సెంట్లూ ఎడాపెగడి అలంకారాలు సత్యన్నారాయణమీద పెట్టారు భోజనం చేసిన వెంటనే బయలుదేరాడు సత్యన్నారాయణ

రాత్రి పదిగంటలకల్లా నూత్నదంపతుల్ని పడకగదిలోకి పంపించేసి ఎవరు దారిని వారు పోయారు సీతారామమ్మ ఇంకా రాలేదు కారణం ఏమయి వుంటుందా? అనుకున్నాడు సత్యన్నారాయణ రామ్మూర్తీ, నరసింహం స్టేషనుకు వెళ్లారు, ముసలివానికి ఇంటికి దారి తెలుస్తుందో తెలియదో అని ఎడలికగా ఉండడం చాత కుర్చీలో వాలబడగానే కునుకు పట్టేసింది సత్యన్నారాయణకు ఎంతసేపు అలా నిద్రపోయాడో తెలిదుగాని ఓ రాత్రప్పుడు కేకలు, అరుపులు, సాధింపులు, చికాకులు, గడిబిడలతో మెలకువ వచ్చేసింది సీతారామమ్మ వచ్చింది రావడంలోనే ఆరంభమయింది గొడవ. అక్కడ ఇక ఒక్కక్షణం

కూడా వుండనని, తిరుగు బండికే వెళ్లిపోతానని అంటూంది ఆవిడ రామ్మూర్తి పెద్దగా కేకలు వేస్తున్నాడు. 'ఆ నోరు మూసుకొని పడివుండమను' అని సీతారామమ్మ స్టేషనుదగ్గర్నుంచే గోల ఆరంభించింది ఆవిణ్ణి ఇంటికి తీసుకొని రావడమే కష్టమయింది. వచ్చినదగ్గర్నుంచి ఆవిడ ఒకటే రాగాలు తన కూతురు పెళ్ళి తనకు కళ్లారా చూసుకువేందికి లేకుండా చేసారని కళ్లారా ఒక్కకూతురు కళ్యాణశోభ చూడలేకపోయిందని ఆవిడ ఏడ్పు పార్వతి బ్రతుకు అలా బ్రద్దలయింది, సరోజమాట దేవుడెరుగును. సరస్వతినయినా పచ్చగా పెళ్లికూతురు వేషంలో చూడలేకపోయింది

'శుభమస్తు' అని పెళ్ళి చేస్తూవుంటే ఈ ఏడ్పులేమిటి ? ఇంతవరకు ఎలాగూ రానే వచ్చింది ఇప్పుడిక గోలపెట్టి ప్రయోజనం ఏమిటి? మరింత రభసగానా?' అని ఎంత సముదాయించినా ప్రయోజనం లేకపోయింది.

ఉదయం పెళ్లివారితో చెప్పినప్పుడు; 'అమ్మకి ఆరోగ్యం సరిగ్గా వుండడం లేదు మతికూడ చెడినట్టుంది. ఎవ్వరూ మాట్లాడించకండి' అని అన్నాడు రామ్మూర్తి

'నాకేమీ మతిపోలేదు. బాగానే వున్నాను.

# కళ్యాణ శోభ

వీళ్లందరూ కలిసి నన్ను పిచ్చిదాన్ని చేసారు. నిజంగా మతిపోయింది నాకు కాదు వీళ్లకి. లేకుంటే కన్నతల్లిని తన కూతురు పెళ్లి చూడనివ్వకుండా చేస్తారా? ఎవళ్ళయినా తోబుట్టువుల్ని పెళ్లికి రావద్దని శాసిస్తారా? పిల్లలు చెడ్డవాళ్లయితే ఏ తల్లయినా చంపేసుకుంటుందా? వీళ్లకి మతులుండి చేసిన పనులేనా ఇవి?' అని ప్రశ్నిస్తూంది ఆవిడ ఆవిణ్ణి ఊరుకోబెట్టడం అసాధ్యం అయింది. వాగి వాగి ఆమెమట్టుకు ఆమే ఎప్పుడో ఊరుకొంది

ఉదయం భోజనాలయాయి. రాత్రికి విందు ఏర్పాట్లు జరుగుతున్నాయి సత్యన్నారాయణ తాంబూలం వేసుకొని సిగరెట్టు కాల్చుకుంటూ కూర్చున్నాడు పందిట్లో మగపెళ్ళివారు భోజనాలు పూర్తిచేసుకొని విడిదికి వెళ్లిపోయారు. సత్యన్నారాయణ దగ్గరకొచ్చి కూర్చుంది సీతారామమ్మ.

'పెళ్లి చేసారు పెళ్లి? నన్ను కళ్లారా చూసుకోనిచ్చారు కాదు. వారంరోజుల క్రిందటనే సంబంధం నిశ్చయమయితే వెంటనే నాకు కబురు చెయ్యకూడదూ? రాత్రికి రాత్రి, ఏడుపందలమైళ్ళు ప్రయాణంచేసి రావడం ముసల్దానికి నాకు సాధ్యమా? అందులోనూ వస్తే నేను ఒక్కర్తేనే రా అని శాసనం

సరోజను కూడ వెంటబెట్టుకొనివస్తే స్టేషను దగ్గరే నాకు తిరుగుముఖం పట్టించాలని వచ్చారుట. నామీద జాలి అంటే కాదు'

'సరోజ ఎందుకు రాకూడదు?' అని అడిగాడు సత్యన్నారాయణ

కళ్లనీరు పెట్టుకొని ఆ ప్రశ్నకు జవాబు కొంతసేపటివరకు చెప్పలేకపోయింది సీతారామమ్మ ఇంతలో రామ్మూర్తి నరసింహం వచ్చి ఆమెను అక్కడ్నుంచి తీసుకొని వెళ్లిపోయారు లోపలకి 'ఇప్పటికి ఈ ఏడ్పులు చాలించు' అంటూ.

రాత్రి విందు భోజనాలయాయి. రామ్మూర్తి తోటి ఉద్యోగస్తులు ఎందరో వచ్చారు ఒక్కరొక్కరే వెళ్లిపోయారు. మిగిలిన బంధువులూ, ఆడంగులూ భోజనాలు చేస్తున్నారు శివుడొచ్చాడు. వస్తూనే ఆరంభమయింది మళ్లీ రగడ అన్నగారి మీద మండిపడుతున్నాడు

'నువ్వెలాగ వచ్చేసావు, దాన్ని ఒకత్తెనూ వదలేసి' అని అడిగింది సీతారామమ్మ

'తనే వెళ్ళమంది నాకెలాగూ అదృష్టం లేదు నువ్వయినా చూసిరా నా సంగతి నేను చూసుకోగలనులే రెండు రోజులు' అన్నది దానిమీదేపాటి అభిమానమయినా లేదు ఈ మహానుభావులుకి ఎంతసేపూ తామూ, తమ భార్యలు బాగా ఉంటే సరి. అవతలవాళ్లు ఎలా తగలబడినా వీళ్లకు పట్టదు. దానికి ఈ దుర్గతికి వీళ్లే కారణం. పెళ్లెందుకు చెయ్యకపోవాలి ? ఇదంతా వచ్చి మోసం అమాయకుల్ని మోసం చేస్తే ఆ పాపం వీళ్ళని చుట్టుముట్టి బాధపెట్టుంది' అని కేకలు వేస్తున్నాడు రామ్మూర్తికి కూడా కోపం ఆగలేదు అన్నదమ్ములిద్దరూ కలియబడారు. శివుడు రుద్రుడయాడు అన్నగార్ని నరికేస్తానని కత్తి ఎత్తాడు.

'నేను చేసిన పని తప్పయినప్పుడు నాకా శిక్ష తప్పక వెయ్యవలసిందే నీ చేతుల్లో చావడంకన్న నాకు సంతోషకరమైన చావు మరి వుండదు' అన్నాడు రామ్మూర్తి

అందరూ అడ్డుపడ్డారు. శివుణ్ణి

పత్రికలో నీ కథ చదివానోయ్
చాలా బావుంది - చివర రచన అని
నీ పేరు చూసి ఆశ్చర్యపోయానంటే నమ్ము



చీవాట్లు వేసారు.

'ఇక్కడ ఒక్క క్షణం అయినా వుండొద్దు. మనం పోదాం పదవే అమ్మా! వీళ్ల ముఖాలు మళ్లీ ఈ జన్మలో చూడకూడదు. ఇంత చేసిన వాళ్లు ఎంతైనా చెయ్యగలరు' అన్నాడు.

ఏమాటా అనకుండా వాడివెంట నడిచింది సీతారామమ్మ.

సత్యన్నారాయణ ఆమె చేతులు పట్టుకొన్నాడు.

'కాస్త శాంతించండి. అందాక మా యింటికి రండి ఈరాత్రి వుండి ఉదయమే వెళుదురుగాని' అన్నాడు.

సత్యన్నారాయణ యింటికి వచ్చాక శివుడు కాస్త చల్లబడ్డాడు.

'ఇంతకీ సరోజ ఒక్కర్తెకోసం మీరం దరూ యెందుకు యింత తగువు పట్టు న్నారు ?' అని అడిగాడు.

'అది ఒక్కర్తే అయితే ఏబాధా లేక పోయేది, దానికొక బిడ్డకూడాను ఆర్నెల్ల యింది. దాని పీక నులిపి పారేయమంటే ఏతల్లికి చేతులొస్తాయో చెప్పు నాయనా?' అంది సీతారామమ్మ.

'ఇదంతా ఎలా జరిగింది. అన్నదమ్ములు వదినగార్ల అండన వుండేదేమో?'

'అదంతా ఆ భగవంతుడికి తెలియాలి నాయనా!'

'ఇంతకీ అతడెవరో తెలిసిందా?!

'తెలియకేమి? అందరకూ తెలుసు.'

'తెలిసే ఊరుకున్నారన్నమాట?'

'తెలిసి మాత్రం లాభం ఏమిటి? వాడికి పెళ్ళాము, నలుగురు పిల్లలున్నా. అయినా వాడు దాన్ని అన్యాయం చెయ్యను, తన దగ్గరే అట్టే పెట్టుకుంటానన్నాడు కాని ఆ తల్లీ, పెళ్ళాము ఉండనిస్తేనా? ఇంట్లో కాలు పెడితే దాన్నీ పిల్లనీ కూడ ముక్క ముక్కలుగా నరికి పారేస్తానన్నారు. లేదా తమనేనా నరికేయమని కత్తి వాడి చేతికిచ్చారు పిల్లకేమి ప్రమాదం వస్తుందో అని ఊరుకొన్నాం'

'ఇప్పుడు ఎక్కడ వుందయితే?'

# కళ్యాణ శోభ

'పెద్దవాళ్ళిద్దరూ వదిలేస్తే, చిన్న వాడు శివుడు దగ్గర వుంటుంది. ముఖం చూపవద్దన్నారు. చచ్చిపోయావనుకుంటా మన్నారు. ఎక్కడయినా దూరంగా ఎవ రికీ తెలియని చోటు తలదాచుకుంటే తల్లీ పిల్ల పోషణకి ఏమయినా పారేస్తా మన్నారు. ఎక్కడికి పోతుంది? వాడా యింకా చిన్నవాడు. పెళ్ళిచేసుకొని వృద్ధిలోకి రావలసినవాడు. వాడి నెత్తివి చుట్టుకుంది ఈ పాపం. వాడు అగ్గిమీద గుగ్గిలా అయిపోతున్నాడు వీళ్ళ చేసిన పనికి' అని గోడు పెట్టింది సీతారామమ్మ.

'ఏపాపమూ లేదు ఇతరులెవ్వరూ ఒకరు చేసిన తప్పుకి బాధపడనక్కర్లేదు. దాని దారిని బ్రతికనిస్తే చాలు ఒకర్ని చంప డానికిగాని, చచ్చిపొమ్మని చెప్పడానికిగాని ఎవరికీ అధికారంలేదు చాతనయితే సహాయం చెయ్యాలి! సానుభూతి చూపించాలి. దీని కోసం ఇందర్ని ఇంత బాధకు లోనుచెయ్యడం అవివేకం. తన దారిని తన్ను బ్రతకనిస్తే మీ దారిని మీరు బ్రతకవచ్చు చదువు కున్నది, పైగా నర్సింగ్ ట్రయి నింగ్ కూడ ప్యాసయిందిగా దానికొక ఉద్యోగం చూసిపెడితే పోయె. అదృష్టం వుంటే దాని బ్రతుకే బాగుపడవచ్చు. వీరెవ్వరికి ధైర్యం లేకపోతే నా దగ్గరికి పంపు. దాని నిర్ణయం ఏమిటో వ్రాయ మను. నేను కూడ దాని పేర ఉత్తరం రాస్తాను. ఇంతటితో ఈ గొడవ చాలిం చండి. ఈ పెళ్ళేదో పొంతంగా సక్ర మంగా జరిగి సరస్వతి అత్తవారింటికి వెళ్ళిపోయేవరకు చూడండి రామ్మూర్తి తప్పేమీ లేదు ఇందులో. ఒక పెళ్ళిచెయ్యా లనే పట్టుదలే వాణ్ణి ఈపని చేయించింది. ఏడెనిమిదివేలు ఖర్చుపెట్టి కలకాలం సుఖ పడాలని కళ్యాణం తలపెట్టి మీ రిట్లా కొట్లాడుకోవడం భావ్యం కాదు చూసిన వాళ్ళకి ఇది పెళ్ళిపందిరి కాని రణరంగం కాదని నిరూపించండి జరిగినదంతా మరచి పోయి ఈ రెండులోజులూ సఖ్యంగా సర దాగా, సహపంక్తిని భోజనాలు చేయండి. కలతలు మానుకొని కళ్యాణ శోభను కాపా డండి' అన్నాడు సత్యన్నారాయణ.

శివుడు చల్లారేదు సీతారామమ్మ తిరిగి యింటికి వెళ్ళింది. అందరి ప్రాణాలుకి హాయి చేకూరింది.

మరో పదిరోజులనాడు సరోజను చంటి పాపను తీసుకొనివచ్చి శివుడే వచ్చి సత్య న్నారాయణ ఇంట దిగవిడిచివెళ్ళాడు. సరోజ తన చరిత్ర చెప్పుకొని ఏడ్చింది

'ఏడ్చేవాళ్ళకి జీవితం కాదు జీవించా లంటే ధైర్యం కావాలి. అన్నాడు సత్య న్నారాయణ

సత్యన్నారాయణ ప్రయత్నం శీఘ్రంగానే ఫలించింది. సరోజకు పట్నంలో జనరల్ హాస్పిటల్ నర్సుగా ఉద్యోగం దొరికింది! వుండడానికి 'క్వార్టర్సు' ఇచ్చారు పాపని కనిపెట్టడానికి ఒక దాదిని పెట్టుకుంది. ఈ కొత్త జీవితానికి క్రమంగా అలవాటు పడింది. రామ్మూర్తికి మాత్రం సరోజ అక్కడ వుండడం కష్టంగా తోచింది. అటువంటి పతితను ఆదరించిన సత్య న్నారాయణను ఆయన క్షమించదలచుకో లేదు 'వాణ్ణి మళ్ళీ నా గుమ్మంలో అడుగు పెట్టనివ్వను' అన్నాడు కాని సత్యన్నారా యణ మాత్రం చలించలేదు వీలయినప్పు డల్లా రామ్మూర్తి యోగక్షేమాలు అడిగి పోతూ వుండేవాడు.

ఆఫీసునుంచి తిరిగివస్తూ సత్యన్నారా యణ ఒక సాయంత్రం రామ్మూర్తి ఇంటికి

నాతో తగువు పెట్టుకోవద్దని లక్షసార్లు చెప్పా! వింటేగా!





వెళ్ళేసరికి రామ్మూర్తిగారి భార్యగాని ఇంటిదగ్గర లేరు పిల్లలు మాత్రమే కనిపించారు అడిగాడు 'హాస్పిటల్‌కి వెళ్ళారు' అని చెప్పింది పెద్దపిల్ల

'ఏమయిందే మీ నాన్నకి?' అని అడిగాడు

'నాన్నకి కాదు, అన్నకి. నిన్న సాయంత్రం మామిడిచెట్టుమీన్నుంచి క్రిందపడ్డాడు తెలివి తప్పిపోయింది స్నేహితులు హాస్పిటల్‌కి చేర్చారు నాన్నతో చెప్పారు నాన్నా అమ్మా రాత్రే వెళ్ళారు. అమ్మ అక్కడే వుంది'

'ఎలాగుందే వాడికి ఇప్పుడు?'

'నిన్న రాత్రే ఆపరేషన్ అయిందట ఇవాళ వార్డులోకి తెచ్చారట. తెలివి వచ్చిందట'

'బెడ్ నెం?'

'42.'

అటునుండి అటుగానే సత్యన్నారాయణ హాస్పిటల్‌కి వెళ్ళాడు. 'సర్జికల్‌వార్డు'లో బెడ్ నెం 42 దగ్గర రామ్మూర్తి, భార్యా కూర్చొని వున్నారు రామ్మూర్తి ముఖాన్ని విషాదం తాండవిస్తోంది. సత్యన్నారాయణను చూడగానే కాస్త తేరుకున్నాడు

'చూశావా ఈ పిల్లల సంగతులు వీళ్ళు తిన్నగా బ్రతకరు. నన్ను బ్రతకనివ్వరు. నిన్న రాత్రంతా నేను పడిన బాధ ఆ భగవంతుడికి తెలియాలి మొక్కని దేవుళ్ళు అంటూ లేరుకదా ఆ తిరుపతి వెంకటేశ్వరుడి మీద భారం అంతా పడేసి కూచున్నాను అంటే నమ్మ ఏదో కాసింత ఆయుర్దాయం వాడికి, అదృష్టం మనకీ ఉండబట్టే ఈమాత్రం నిలిచాము. లేకపోతే వాడిముఖం చూస్తానని అనుకోలేదు అంత ఎత్తునుంచి పడ్డాడేమో, నడుమూ తుంటి ఎముక విరిగాయి. కడుపులో కిడ్నీలు 'హెమరేజ్' అయాయి వెంటవెంటనే ఆపరేషన్ చెయ్యబట్టి ప్రాణం దక్కింది. మరికొంచెం ఆలశ్యమయితే అది కూడ సాధ్యం అయ్యేదికాదు సరోజ ఉండబట్టి ఆ సర్జనును లాక్కొచ్చింది. ఇది మేజర్ ఆపరేషన్ తావే ఆపరేషన్ థియేటరులో వుండి సర్జన్‌కి అసిస్టుచేసింది దాని పట్టుదల వలననే మావాడి ప్రాణాలు దక్కాయి అది మాకు పుత్రభిక్ష పెట్టింది దాని ఋణం ఈ జన్మంలో తీర్చుకోలేను'అని ఒక వరసన చెప్పుకొని పోతున్నాడు రామ్మూర్తి రామ్మూర్తేనా ఈ మాటలు అంటున్నది! ఒకప్పుడు సరోజను చచ్చిపొమ్మని శాసించిన రామ్మూర్తి ఎంత మారిపోయాడు!

రెండునెలలు నాటికి రాముడులేచి తిరుగుతున్నాడు. రామ్మూర్తి ఆనందానికి హద్దు లేక పోయింది. 'తిరుపతి 'వెంకటేశ్వ'రుడి మొక్కు తీర్చుకుందేందికి మళ్ళీవారం బయలుదేరుతున్నాం?—' అని చెప్పాడు రామ్మూర్తి ఇంటికి వచ్చిన సత్యన్నారాయణతో.

'మంచిదే దానికిముందు మరొక శుభ కార్యం చెయ్యగలవా?' అని అడిగాడు సత్యన్నారాయణ

'ఏమిటది?'

'సరోజని పెళ్ళి చేసుకోడానికి ఒక అబ్బాయి అంగీకరించాడు సరోజకూడ ఇష్టపడింది. రేపువాళ్ళు 'సివిల్ మేరేజ్' చేసుకుంటారు, రిజిస్ట్రారు ఆఫీసులో నువ్వు ఒకసాక్షిగా సంతకంచేసి వాళ్ళని ఆశీర్వదించడానికి రావాలి' అన్నాడు సత్యన్నారాయణ.

'అంతేకాదు వాళ్ళకి మాయింట్లో విందుకూడ ఏర్పాటుచేస్తాను. అమ్మకూడ ఇక్కడేవుంది అదికూడ వాళ్ళని ఆశీర్వదిసుంది' అన్నాడు రామ్మూర్తి.

'కొత్త పెళ్ళికూతురు వేషంలో సరోజను చూసిన సీతారామమ్మ 'కళ్యాణ శోభను కళ్ళారా చూసాను, నాజన్మ తరించింది' అని కళ్ళ నీళ్ళు తుడుచుకుంది ●

ఒకప్పుడు రాజూ, మల్లన్నమంత్రి కొంతమంది సైనికులతో కలసి చంద్రపురం అడవికి వేటకు వెళ్లారు. రాజు ఒక పెద్ద పులిని తరుముతూ సైన్యం నుండి దూరంగా వెళ్లిపోయాడు. ఒక్క అంగరక్షకుడు మాత్రం రాజును అనుసరించి వెళ్ళాడు.

రాజు సైన్యంనుండి బాగా దూరం కాగానే పశ్చిమదేశపురాజు సైనికులు అతనిమీద ఒకేసారిపడి బందించివేశారు. పశ్చిమదేశపు సైనికులు బంధింపబడిన రాజును సూర్యపురం వైపు తీసికొని పోసాగారు. దానిని రాజుయొక్క అంగరక్షకుడు చూశాడు. ఆ సంగతిని మల్లన్నమంత్రితో చెప్పడానికి అంగరక్షకుడు వెనుకకు తిరిగి చంద్రపురం అడవివైపుకు పరిగెత్తసాగాడు.

పారిపోతున్న అంగరక్షకుడిమీదకు పశ్చిమదేశపు సైనికులు బాణాలను వదిలారు కాని అతడు వాటినన్నింటినీ తప్పించుకొని మల్లన్నమంత్రిని చేరుకొన్నాడు. జరిగిన విషయాన్ని అంగరక్షకుడు మల్లన్నమంత్రికి తెలియజేశాడు. రాజును విడిపించడానికి మల్లన్నమంత్రి సైనికులతో సహా సూర్యపురంవైపు బయల్దేరాడు.

అంగరక్షకుడు తమ బాణాలనుంచి తప్పించుకొని పారిపోయిన సంగతిని పశ్చిమదేశపు సైనికులు గ్రహించారు. అందుచేత వారు రాజుని తీసికొని వడివడిగా సూర్యపురంవైపు పారిపోసాగారు.

చంద్రపురం అడవినుంచి సూర్యపురం వెళ్లేదారిలో నాలుగుదారుల




కూడలి ఒకటి ఉంది. ఆ కూడలికి మధ్యను ఒక స్తంభం ఉంది. ఏదారి యేపట్టణానికి వెళ్లేదీ తెలిపే రెక్కలు ఆ స్తంభానికి ఉన్నాయి. సూర్యపురానికి వెళ్లేదారి మల్లన్నమంత్రి సైనికులకు తెలియకుండా ఉండేటందుకు గాను పశ్చిమదేశపు సైనికులు ఆ స్తంభాన్ని వూడబెరికి దారిప్రక్కగా పారవేశారు.

మల్లన్నమంత్రి సైనికులతో సహా ఆ కూడలికి వచ్చాడు. అక్కడ దారులను చూపించే స్తంభం లేదు. ఏ దారి సూర్యపురానికి వెళ్లేదీ మల్లన్నమంత్రికిగాని సైనికులకుగాని తెలియదు. అప్పుడు యేమి చేయాలో యెవరికీ తోచలేదు. ఆలస్యం చేస్తే పశ్చిమదేశపు సైనికులు రాజును తీసికొని సూర్యపురాన్ని చేరుకొంటారు. అప్పుడు రాజును విడిపించడం చాలా కష్టం.

మల్లన్నమంత్రి అప్పుడు అటూ యిటూ చూశాడు దారి ప్రక్కను పడి ఉన్న రెక్కల స్తంభం అతనికి కనిపించింది. ఆ స్తంభాన్ని దారి ప్రక్కకు తీసికొని రావలసినదిగా మల్లన్నమంత్రి సైనికులకు ఆజ్ఞాపించాడు. సైనికులు ఆ స్తంభాన్ని పూర్వం ఉండే చోటుకు తీసికొని వచ్చారు.

చంద్రపురం అని రాసి ఉన్న రెక్క తాము వచ్చిన దారివైపుకు ఉండేలాగున ఆ స్తంభాన్ని నిలబెట్టవలసినదిగా మల్లన్నమంత్రి సైనికులకు ఆజ్ఞాపించాడు. సైనికులు అలాగున చేయగానే సూర్యపురం అని రాసి ఉన్న రెక్క కుడిచేతివైపు ఉన్న దారిని సూచిస్తూ ఉంది.

మల్లన్నమంత్రి అప్పుడు కుడిచేతి వైపు ఉన్న దారిని వెళ్లగానే అతనికి రాజును తీసికొనిపోతున్న పశ్చిమదేశపు సైనికులు కన్పించారు. మల్లన్నమంత్రిని చూడగానే పశ్చిమదేశపు సైనికులు రాజును వదలివేసి పారిపోయారు. మల్లన్నమంత్రి రాజుతో సహా రాజధానిని చేరుకొన్నాడు.

మల్లన్నమంత్రి ఆలోచనను అందరూ కొనియాడారు. ●



# తప్పయి పోయిందనుకో ఔదార్యం



## ఫరవాలేదులెండి

కె. రామలక్ష్మి

మీ భర్తగారేదైనా తప్పు చేశారనుకోండి (అది అసాధ్యమే అయినా మాట వరసకి చేశారనుకుందాం!) పై పెచ్చు అలా చేసినట్టు ఒప్పుకున్నారనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు? నవ్వేసి క్షమించేసి ఊరుకుంటారా? లేకుంటే అప్పటికి పోనిచ్చి, జాగ్రత్తగా జ్ఞాపకంలో పెట్టుకుని మంచి ఆయుధం దొరికింది— మళ్లీ తప్పు చేస్తే ఉపయోగించడానికి అనుకుంటారా? లేకుంటే మీరే తప్పుచేస్తే తప్పించుకుందుకిదొక చక్కని దారిగా భావిస్తారా? ఏం చేస్తారు?

నా స్నేహితురాలొకామె యీ గమ్మత్తయిన విషయం చెప్పింది 'సాయంత్రం ఆరు గంటలకల్లా సినిమాకి వెడదాం, తిన్నగా అక్కడికి వచ్చెయ్యి నేనూ వస్తాను, అన్నారు సరేకదా అని వెళ్లాను దరిదాపు ఏడుగంటలదాకా వెధవ ముఖం వేసుకుని ఎదురు చూస్తున్నాను ఆఖరికి హడావిడిగా వచ్చారు 'ఇక్కడున్నావా? మనం ఆ థియేటరు దగ్గిరికి కదా పోవాలనుకున్నది? అంటూ పరామర్శించారు. లేదు మీరు వెళ్లిందే తప్పు థియేటరు అన్నానే గాని ఆయన్ని ఒప్పించలేకపోయాను ఇదివరకెన్నోసార్లు ఇలాగే చేశారు. అవన్నీ జ్ఞాపకం చేద్దామా అనిపించింది. కాని ఏం లాభం? సినిమా టైము ఎలాగా అయిపోయింది దెబ్బలాటకూడా ఎందుకు? 'పోనీలెండి అలా తిరిగేసి యింటికిపోదాం' లని యింటిముఖం పట్టించి అవతలికి దారి తీశాను' అంటూ చెప్పింది

ఇటువంటి చిన్న విషయాలలోనే కాక పెద్ద విషయాలలో కూడా మాటకి మాట నేర్చి పాత తప్పిదాలన్నీ ఏకరువు పెట్టడం ఎందుకు చేస్తారో తెలియదుగాని ఆడవాళ్లు ఎక్కువగా చేస్తారు ఎప్పటికప్పుడు స్వల్పవిషయాలలో తప్పొప్పులు మన్నించుకోవడం అన్న ఔదార్యం ప్రదర్శించడం— కష్టమే అయినా అలవాటు చేసుకోవాలి 'రాత్రంతా లైటు వెలుగుతూనే ఉంది పొద్దున్నే లేచి నేనే ఆర్పాను' అని చెప్పి 'మీ కెప్పుడూ యింతే, ఆ రోజు ఆ రోజూ అలాగే వీధితలుపు గడియ వేయనే లేదు' అంటూ ప్రారంభించడం వల్ల ఏం ప్రయోజనం? 'నేనా ఆఖర్న పడుకుంటా?' అన్న ఎదురు ప్రశ్న— పేచీ, ఎదురౌతుంది.

చిన్న చిన్న మతిమరుపు పనులు అందరూ చేస్తూ ఉంటారు కాని అలా చేసేవాళ్లే ఎక్కువగా ఎదుటివారి లోపాలను కూడా జ్ఞాపకం పెట్టుకోవాలని చూస్తారు — తాము చేసినప్పుడు— చెప్పడానికి వీలుంటుందని కాబోలు!

తప్పులు చేయడం అందరూ చేస్తారు కాని ఒప్పుకోవడం అన్నది కూడా నేర్చుకుంటే ప్రాణం విశ్రాంతిగా ఉంటుంది కదూ? లేకుంటె ఎప్పటికప్పుడు ఒకరినొకరు దెప్పుకుంటూ ఎత్తి పొడుచుకుంటూ ఉంటే ఎక్కడికి తెమిలేను? జీవితాంతం సాగవలసినదే!

అందుకే ఔదార్యమైన దృక్పథం అలవరచుకోవాలనడం 'తలుపు వేయడం మరచిపోయారు పోనీలెండి — నే వస్తూ వేసేశాను.' అంటే సరిపోయేచోట 'అప్పుడూ అలాగే చేశారు— ఊరికి వెడుతూ కిటికీలు సరిగ్గా మూయ్యలేదు'అని జ్ఞాపకం చేయడం శుద్ధ దండుగ 'ఫరవాలేదు లెండి. ఏం ప్రమాదం జరగలేదుగా' అని సద్దుకుంటే పోయే

ఎదుటివారి తప్పులనే ఎత్తి చూపుతూ ఉండడం ఏమంత తెలివైన పనికాదు ఆ లోపాల ఫలితాలు 'బూమరాంగు'లాగా మనపైనే తిరుగబడవచ్చు! ఎదుటివారిపట్ల ఔదార్యం ప్రకటిస్తే— అదే మనకీ ఎదురౌతుంది. ఎంత సుఖం! ●






మమతలూ మమకారాలూ పెంచుకున్న కొద్దీ పెరుగుతాయి. పెరిగి మనసుల్లో విడదీయరాని విడదీయలేని అపూర్వ అనుబంధానికి అంకురార్పణచేసి పెరుగుతున్న కాలంతోబాటు పెరిగి చిగురులు తొడిగి మహావృక్షమై వ్రేళ్ళునాటుకుపోతుంది. నిర్మలమనసుతో పెనవేసుకుపోయిన ఆత్మీయత మనసుకూ మనసుకూ, మనిషికీ మనిషికీవున్న అనుబంధం అపూర్వమైనది. పవిత్రమైనది. అటువంటి అనుబంధాన్నే మరచి మనసుతో ఆటలాడుకుని చివరకి విసిగి, నిర్దాక్షిణ్యంతో మనసులోని మమతలను మరచి క్రొత్తరుచులు కోరే మానవుడు మనసుగల మానవుడు కాదు. దానవుడు ..

రెండుచేతుల మధ్యా తలను ఆన్చి శూన్యంలోకి చూస్తున్నాడు రవి కళ్ళు అగ్నిగోళాల్లా వెలుగుతున్నాయి అలసటతో ఆలోచనలతో బరువెక్కిన రెప్పలు భారంగా కన్పిస్తున్నాయి. ఎన్నో ఆలోచనలు, ఏవో ఆవేదనలు సుళ్ళు తిరుగుతూ ఆ అలల చలనాన్ని రవిమీద ప్రసరింప జేస్తున్నాయి. గాలివాటుకు రెపరెపలాడుతోంది చేతిలోని కాగితం. బరువుగా కళ్ళుదించి తిరిగి చదువుతున్నాడా ఉత్తరం.

రవిగారూ,

మీ పెళ్ళి శుభలేఖ అందింది. కనీసం శుభలేఖ పంపాలన్నందుకైనా నేను గుర్తుకు వచ్చాను. చాల సంతోషం. కొన్నిసంవత్సరాలైందనుకుంటా మీకుత్తరం వ్రాసి. అందుకేనేమో అలవాటు తప్పిన మనసు, చేతులు, నిర్లిప్తంగా వుండి పోతున్నాయి, కానీ ఏదో వ్రాయాలి...

మిమ్మల్ని చూసి కొన్ని సంవత్సరాలైంది. చూడాలని వుంది. ఈ కోరిక మీ పెళ్ళిముందే కోరితే ... ఇప్పుడనుకుని ఏం లాభం. ఆ అవకాశం నాకు దూరమైంది. ఇప్పుడా అర్హత కూడ నాకులేదు. నేరం చేయగా అనుభవించే శిక్షలో ఆనందం వుంటుంది. ఏ నేరం చేయకుండానే అనుభవించే దండన నరకప్రాయమే అవుతుంది కదూ!

పోన్లెండి ... ఇప్పుడవన్నీ ఎందుకు? నేనెక్కడవున్నా ఏం చేస్తున్నా ఎప్పుడు మీ ఆనందం, సౌఖ్యం మాత్రమే కోరుతూ వుంటానని, అంతకు మించి కోరదగ్గది కూడ నాకులేదని మీకు తెలుసు. మీ నూతన దంపతులకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు.

—శాంతి.

'శాంతి!' పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు. నాకు తెలుసు శాంతీ నాకు తెలుసు. నువ్వు నన్ను క్షమిస్తావు. మనసారా క్షమిస్తావు, కానీ నేను పాపిని. నీ మనసును ఆట బొమ్మను చేసి ఆడుకున్నాను నిర్లక్ష్యంతో క్రిందకి విసిరి ముక్కలు ముక్కలు చేశాను. అయినా...అయినా కూడ నువ్వు నన్ను క్షమిస్తున్నావు. ఇంతకన్నా నన్ను చిత్రవధ చేసినా, సంతోషించే వాడినే శాంతీ!

మౌనంగా ఆలోచిస్తున్నాడు రవి.

హోరుగాలి కిటికీలను చీల్చుకుని లోపలికి ప్రవేశించింది. ఎంతో ప్రశాంతంగా వున్న వాతావరణాన్ని భీభత్సం చేస్తోంది. కేలండర్లు, ఫోటోలు, విపరీతమైన శబ్దాన్ని చేస్తున్నాయి. సన్న సన్న చినుకులు క్రమేపీ పెద్దవై హోరుగాలితో కలిసి వికటాట్టహాసం చేస్తున్నాయి.

రవి మెల్లగా లేచాడు.

శాంతి ఆఖరిసారిగా తనకు వ్రాసిన ఉత్తరం. తన ప్రాణ ప్రదంగా ఆమె జ్ఞాపకార్థం తనకోసం వుంచుకున్న ఏకైక కానుక, ఎవరైనా చూస్తారేమో నన్న భయంతో పుస్తకాల షెల్ఫులో తన అసమర్థతకు చిహ్నంగా అట్టడుగున తను దాచిన ఉత్తరం పైకి తీశాడు. చేతులు వణికాయి. మెల్లగా తెరిచాడు.

'బావా!...'

చినుకులు పడి అక్షరాలను చెరిపి వేశాయి. మరుక్షణంలో నీటి బిందువు మెల్లగా క్రిందకు జారింది.

తలుపులు మూసి ఉత్తరాన్ని అతి జాగ్రత్తగా పట్టుకుని, భారంగా కుర్చీలో కూర్చుని, మూడు సంవత్సరాల క్రిందటి ఆ ఉత్తరం తిరిగి చదవటాని కుపక్రమించాడు.

'...మీ ఉత్తరం అందింది . ఎప్పుడా ఎప్పుడా అని ఎదురుచూసే నాకు మీ ఉత్తరం ఎటువంటి అనుభూతుల నందించిందో, నాపై ఎటువంటి ప్రభావాన్నం దించిందో చెప్పనవసరం లేదనుకుంటాను మీరు వ్రాసిందంతా నిజమా బావా! లేక నాతో పరిహాసానికని వ్రాసిందా అదంతా! నా కిప్పటికీ నమ్మకం కలగటం లేదు మిమ్మల్ని మర్చిపొమ్మని వ్రాశారు. కారణం అడగ వద్దన్నారు. నన్ను మరెవరినైనా వివాహం చేసుకోమనీ, పరిస్థితులు అనుకూలంగా లేవనీ, జరిగిన దానికి చిత్రవధ అనుభవిస్తున్నాననీ ఇదే ఆఖరుసారి ఉత్తరమనీ వ్రాశారు...నిజమా బావా!

ఎందుకు? ఎందుకని ఇలా మారి పోయారు? మిమ్మల్నలా మార్చి వేసిన పరిస్థితులేమిటి...? నాతో చెప్పకూడదా. చెప్పనవసరం లేదా...? ఎటువంటి పరిస్థితులనైనా ఎదిరిస్తాననీ, నన్ను వివాహం చేసుకుంటానని, మీరు చేసిన ప్రమాణాలన్నీ ఏమైపోయాయి బావా! ఎందుకు నా కింత అన్యాయం చేస్తున్నారు? మాటివ్వటం అంత తేలికనుకున్నారా! నిలుపుకోవాలనే భయం మీ కప్పుడు లేకుండా పోయింది కదూ! ప్రేమ అనురాగం, అంటూ ఎన్నో మాటలువల్లించిన మీ నోటితోనే మర్చిపొమ్మంటున్నారు. ...ఎంత తేలిగ్గా అనగలిగారు బావా.

మీ పదిపేజీల ఉత్తరం నా హృదయాన్ని చిత్రవధ చేసింది నేనిప్పుడు నరక యాతన ననుభవిస్తున్నాను బావా! అంత ఉత్తరంలోనూ మర్చి పొమ్మనటం, క్షమార్పణలూ తప్ప కారణం వ్రాయరేం! నన్నింత తేలిగ్గా ఎలా మర్చిపోగలరు? చెప్పరేం బావా. నా ఉత్తరం బాధను కల్గిస్తోంది కదూ. ఈ పీడ ఇంకా వదలదంటుందేం అనుకుంటున్నారు కదూ...

మనసుతో ఆడుకుని, దాని మానాన్న వదిలి పెట్టటం, నీ దృష్టిలో, అతి తేలిక విషయం కావచ్చు, కానీ గాయపడిన నా మనస్సు మీలా కోలుకోలేదు. కోలుకోదు అయినా మీ కోరిక ప్రకారమే ప్రయత్నిస్తా బతకాలిగా మరి...!

ఒక్క కోరిక బావా! మీరు త్వరలో వివాహం చేసుకుంటారని నాకు తెల్సు పెద్దల సలహా ప్రకారమే, కట్నం కానుకలతో వాళ్ళు నిర్ణయించిన అమ్మాయినే చేసుకుంటారని కూడ తెలుసు కాని... పెళ్ళి చేసుకోకుండా మటుకు ఎవరి మనసులతోనూ ఆడుకోకు. ఎందుకంటే అందరికి నాలాగా తట్టుకునే శక్తి లేక పోవచ్చు..

సంబంధమే లేదన్న నీతో...ఆత్మీయతను సూచించే 'నువ్వు' వాడకూడ దనుకున్నా.. కానీ అలవాటు... మానలేక పోతున్నా... క్షమిస్తావుకదూ !'

రవి కళ్ళలో నీళ్ళు నిండాయి సుదీర్ఘమైన ఆ ఉత్తరమంతా చదవలేక మోహానికి చాటు చేసుకుని వేదనతో కనులు మూసుకున్నాడు.

* *

అంతవరకూ సీరియస్‌గా కథ వ్రాస్తున్న డాక్టర్ వేణు, వ్రాయటం ఆపి పెన్ను మూసి టేబిల్ పైన పెట్టి నిశ్శబ్దంగా కొంతసేపు వుండిపోయాడు.

కవికీ వైద్యుడికీ పొత్తు కుదరదు.

మనసుకీ చేతలకీ పోలికే వుండదు.

మనసు మరో లోకాల్లో పరుగులు తీస్తూ వుంటుంది.

శరీరం చేతలు భవాల కతిదూరంగా పయనిస్తూ వుంటాయి.

మెల్లగా లేచాడు వేణు. విధి నిర్వహణ కార్యక్రమంలో మునిగిపోయాడు.

* * *

'గుడ్ మార్నింగ్ డాక్టర్'

'గుడ్ మార్నింగ్!'

విష్ చేస్తున్న తన నర్సింగ్ హోమ్‌లోని ఇతర డాక్టర్లని చిరునవ్వుతో చూస్తూ హుందాగా ముందుకు వెడుతున్నాడు వేణు.

చిరపరిచితమైన డాక్టర్ అడుగుల చప్పుడు విని లేవగలిగిన రోగులు ఆత్రుతతో లేచి నుంచున్నారు. డాక్టర్‌తో తమ బాధలన్నీ చెప్పాలని తహతహ లాడి పోతున్నారు. లేవలేనివారు పడుకునే బాధను నోర్చుకుంటూ, నమ్రతగా చిరునవ్వుతో రెండుచేతులు జోడిస్తున్నారు. అందర్నీ చిరునవ్వుతో పేరు పేరున పలకరిస్తూ, నేర్పుతో ఓర్పుతో వారి సందేహాలను తీరుస్తున్నాడు.

'దండాలండీ బాబూ .!' మంచానికతుక్కుపోయి లేవలేక లేవలేక లేస్తున్న పేషంటు రెండుచేతులూ పట్టుకుని లేవనీయకుండా వారించి పడుకోపెట్టాడు. అతని కళ్ళనుంచి కన్నీరు రాలి శుష్కించిన అతని చెక్కిళ్ళమీద కాలువ కట్టింది,

'ఛ . ఎందుకు రాజయ్యా కన్నీళ్ళు... ఆపరేషన్ చేస్తే అదే తగ్గిపోతుంది. దీనికే ఎందుకింత గాభరా పడతావ్!'

తనకూ తెల్సు పాపమా అర్భకుడు ఎంత బాధ అనుభవిస్తున్నాడో ఎంతగా భయపడిపోతున్నాడో

తప్పదు. మృత్యువు సమీపిస్తున్నా ధైర్యంతో వెన్నుతట్టి అతి త్వరలో కోలుకుంటావని వారికి జీవితంపై లేని పోని ఆపోహలనూ, తద్వారా నెరవేరని ఆశలనూ కల్పించటం, మోసం చేయటం డాక్టర్‌గా తన విధి

క్షణ క్షణం ఆత్మవంచన చేసుకుంటూ

# ప్రతిబింబాలు

ఇతరుల ఆత్మలను వంచించటం. డాక్టర్‌గా తనకి వెన్నతో పెట్టిన విద్య

విషాదమైన బాధ మనసంతా చోటు చేసుకుంది.

'బాబూ, కేన్సరంట నాకు. పొట్ట కోసి పెద్ద ఆపరేషన్ చేస్తారంట... పిల్లలకంతా నేనే దిక్కు బాబయ్యా...!' హృదయవిదారకంగా విలపిస్తున్నాడు

దీనాతిదీనంగా మంచం ప్రక్కనే నిలబడి కళ్ళల్లోనే ప్రాణాలు పెట్టుకుని పిల్లల్ని గుండెల కదుముకుంటూ. అర్థంకాని ఆశతో వేణునే చూస్తూ నిశ్శబ్దంగా రోదిస్తోందతని భార్య.

ప్రాణాలన్నీ తన చేతిలోనే పెట్టి ప్రాణభిక్ష నర్థిస్తున్నాడతను.

కన్నీటితో నిండిన మరొక కళ్ళు పతిభిక్ష నర్థిస్తున్నాయి.

ఏది అర్థంకాక తండ్రి బాధ చూడలేక దిక్కు మొహంతో నిలబడ్డారు పసివాళ్ళు

వేణు హృదయం బాధగా మూలిగింది.

భగవంతుడా ఏమిటీ అనుబంధాలు? ఎందుకని సృష్టిస్తావు? మనిషికీ మనిషికీ మధ్య ఇంతటి బలవత్తరమైన బాంధవ్యం కల్పించి విడచి వుండలేని అనుబంధంతో బంధించివేస్తావే. చివరికి నువ్వు కలిగించే శాశ్వత ఎడబాటును తట్టుకుంటారనే అనుకున్నావా!

బాధతో నిండిన హృదయాన్ని గంభీరంతో నింపుకో ప్రయత్నించాడు.

'చూడయ్యా! నువ్వు కాస్త ధైర్యంగా వుండాలి. నువ్వే బెదిరిపోతే పాపమా పిల్లలు చూడు ఎలా చూస్తున్నారో.. అయినా రోజూ లేని భయం ఇవాళెందుకొచ్చింది?'

'బాబయ్యా నర్సమ్మ ఎవళ్ళతోనో అంటోంది నాకు కేన్సరేనంట దీనితోనే మా అయ్య, తోడబుట్టినోడు సచ్చిపోయారు...!' మృత్యువును తల్చుకుని వణికిపోయాడు.

క్షణంలో గంభీరంగా మారిపోయాడు వేణు.

'కేన్సరని ఎవరయ్యా చెప్పింది? ఎవరి మాటలూ నమ్మక ఇది 'కార్సినోమా' అని ఒక విధమైన జబ్బు చాల చిన్న ఆపరేషన్ కూడ. నా మాట నమ్ము...!'

'ఆ క్షణంలో వాళ్ళ మొహాలు వేయి దీపాలు వెలిగించినట్టు వెలిగిపోయాయి.

ఆనందం పట్టలేని రాజయ్య వేణు చేతుల్ని గట్టిగా పట్టుకుని కళ్ళ కద్దుకున్నాడు.

పిచ్చివాడు ఇంత మృదువుగా తను పట్టుకున్న చేతులే కొద్దిసేపట్లో కత్తులు పట్టుకుని తన పొట్టని నిర్దాక్షిణ్యంగా చీల్చబోతున్నాయని అతనికి తెలీదు

ఆమె కన్నీళ్ళు ఆనందంతో మెరుపులా మెరిశాయి

పరిస్థితి అర్థంకాక నిర్మలంగా నవ్వుతున్నారా పిల్లలు.

అమాయకులు వాళ్ళని మోసం చేయటానికి భయంకరమైన కేన్సర్‌కి మారుపేరే 'కార్సినోమా' అని, తను వాళ్ళని అడుగడుగునా మోసం చేస్తున్నాడని .. వాళ్ళకేం తెల్సు తెలిస్తే క్షమించగలరా!

'నర్స్!' వేణు గర్జనకి భయంతో వచ్చి నిలబడ్డారు సిస్టర్స్.

'పేషెంట్సు దగ్గర అతి జాగ్రత్తగా వుండాలని, నోరు జారవద్దనీ ఎన్నిసార్లు చెప్పాను!'

వ్యగ్రరూపంలో రెట్టించి అడుగుతున్న డాక్టర్ వేణును చూసి జవాబు చెప్పలేక తలలు వాల్చారందరూ

'హియరాఫ్టర్ ప్లీజ్ డోంటాక్ ఎనీ రబ్బిష్ ఇన్ ఫ్రంటాఫ్ అవర్ పేషంట్స్ గో!' అసహనంతో కుర్చీలో కూర్చుండిపోయాడు.

కొద్దిసేపటికే ఎంతో సిగ్గుగా వున్నట్టనిపించింది. ఏమిటీ మానసికపరిణామం! ఎప్పుడు లేనంతగా తన మనసెందుకింతగా చలిస్తోంది? కత్తితో నిర్దాక్షిణ్యంగా మనుషులను కోసికోసి బండబారిన తన హృదయంలో కూడ మానవత్వముందా?

మరుక్షణం వేణులోని రచయిత లీలగా మెదిలాడు మృదువుగా నవ్వాడు. మానవత్వానికి మారురూపు కవి హృదయం మానవునికి వన్నెలూ చిన్నెలూ ఆపాదించేకవికి, రసాత్మక హృదయానికి, రసిక మనోభావానికి, ఒక మనిషిలోనే కాదు. ప్రతి వస్తువులోనూ ప్రాణం కన్పిస్తుంది. చలనం గోచరిస్తుంది సౌమ్య హృదయంతో అనుబంధాలు పెంపు చేసుకుంటాడు కవి. మరి సౌహార్ద్ర హృదయం ఎందుకు దూరమౌతుంది?

వేణులోని కవి గర్వంగా నవ్వుకున్నాడు.

'డాక్టర్! ఆపరేషన్ అరేంజి మెంట్సు పూర్తయాయి!' అసిస్టెంట్ పిలుపుతో ఉలిక్కిపడ్డాడు వేణు.

కళ్ళకి గంతలు కట్టబోతుంటే వొణుకుతూ కన్నీళ్లతో నమస్కారం చేశాడు రాజయ్య. ధైర్యంతో అతని వీపు తట్టి తనకు లేనే ధైర్యం తెచ్చుకున్నాడు.

మాంగల్యం చేతితో గట్టిగా పట్టుకుని కన్పించని భగవంతునితో కన్నీటితో ఏదేదో చెప్పుకుంటోంది పాపమా ఇల్లాలు.

ఆపరేషన్ మొదలైంది.

స్కాలిపల్‌తో మెత్తగా ఇన్‌సిషన్ ఇచ్చాడు. రోజూచూసే రక్తమైనా భయంకరంగా కన్పించింది. మనసును దిట్ట పరచుకున్నాడు. అతి నేర్పుతో తక్కిన పొరలనుఛేదిస్తూ ఆగిపోయింది చెయ్యి. చేతిలో రక్తసిక్తమైన కత్తిని చూస్తూ నవ్వుకున్నాడు. ప్రతిరోజూ జీవితాన్ని గురించి మధురిమలనూ మధుర భావాలను అందించే ఈ చేయి, కలంతో మృదువుగా చకచకా ముందుకు పరుగులు తీసే ఈ చెయ్యి ఇప్పుడు నచ్చిరక్తాన్ని స్పర్శిస్తోంది నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తోంది.

మానవులు ఎంతకైనా తగిన వారు.

దేనికైనా చేయగల కసాయిలు.

పేగులు బైటకితీసి, స్టమక్ కత్తిరించి, తిరిగి పేగులతో కలిపి కుడుతున్నాడు. ప్రతిరోజూ కూరలను తరిగినట్లు తరిగి ఏ భాగాన్ని బాధగం నిర్దాక్షిణ్యంగా కత్తిరించే తను కవి.

ఎంత ఆత్మవంచన!

మరుక్షణం కఠినంగా మారిపోయింది వేణు మనసు.

సూచర్సు పూర్తయాయి. ఆపరేషన్ ముగిసింది. బేసిన్‌లో చేతులు కడుక్కుని మాస్కు తీసి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు.

ఇంకా భగవంతుని ప్రార్థిస్తోనే వుందా ఇల్లాలు. క్షణికమైన ఈ దేహం కోసం ఎందుకింత ఆరాటం, తేలిగ్గా నవ్వుకున్నాడు.

*        *        *

ఆవేదనతో ఆలోచనలో మునిగి పోయిన రవి లక్ష్మిరాకనే గమనించలేదు.

'ఏమండి! ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?'

విరజాజుల వాసన గుప్పున కొట్టింది.

మెల్లగా తల తిప్పి చూశాడు.

తెల్లని జరీ చీరలో క్రొత్త అందాలు నింపుకుని కుందనపు బొమ్మలా వెలిగి పోతోంది లక్ష్మి పాలనురగల్లాంటి చెక్కిళ్లు ఆహ్లాదంగా మెరుస్తున్నాయి. ఎటువంటి వారినైనా వశపరచుకుని మత్తెక్కించే ఆమె అవయవ సౌష్ఠవం రవిని క్షణకాలం పిచ్చివాడ్ని చేసింది. తనకు తెలియకుండానే ఉద్రేకం చోటు చేసుకుంది. నిర్మలంగా నవ్వుతూ తన దగ్గరకు వస్తున్న లక్ష్మిని చూసి మనసారా నవ్వాడు.

'రా లక్ష్మి!'

'ఏం అలా వున్నారు? తలనొప్పిగా వుందా?'

మెత్తగా వెచ్చగా తన నుదుటిని తాకింది లక్ష్మిచేయి. ఏవేవో మధురాను భూతులు మనసంతా ఆక్రమించి ఉక్కిరి బిక్కిరి చేశాయి.

అవును లక్ష్మి! కానీ ఇప్పుడు కాదు. నువ్వు వచ్చేశావుగా. నీ వడిలో పడుకుంటే ఎటువంటి బాధనైనా మర్చిపోతాను.' లక్ష్మి చేతిని మరింత గట్టిగా నొక్కుతూ అన్నాడు కళ్ళు మూసుకుని.

రవిలోని శాంతి జాలిగా నవ్వింది.

మరుక్షణం లక్ష్మి చేతిని వదిలేశాడు. బాధతో కణతలు నొక్కుకున్నాడు. నీకు అన్యాయం చేస్తున్నాను శాంతీ ... ఇవే మాటలు ఒకనాడు నీతోనూ అన్నాను కదూ. చూశావా. నే నెంత మోసగాడ్నో, ఎంత స్వార్థపరుడ్నో ... అయినా నన్ను క్షమించే గుణం ఎక్కడ దొరికింది శాంతీ నీకు...!

'ఏమండి! ఎందుకలా అయిపోయారు? తలనొప్పి ఎక్కువగా వుందా, పోనీ అమృతాంజనం వ్రాయనా!' ఆతృతతో, ముందుకు వంగింది లక్ష్మి.

'అబ్బ! నా కేం వద్దు...కాసేపు నన్ను వంటరిగా వుండనివ్వు...!

విసుగ్గా లక్ష్మి చెయ్యి తీసివేసి భారంగా కిటికీ దగ్గరకు నడిచాడు.

అర్థం కాని లక్ష్మి పాపం బిత్తర పోయింది.

...తెల్లగా వెలుగుతున్న చందమామలో శాంతి మరింత తెల్లగా, చల్లగా నవ్వుతుంది.

తనని చూసి జాలిగా నవ్వుతోంది.

'శాంతి!' అస్పష్టంగా బాధగా గొణుక్కున్నాడు.

'నా అసమర్థతవల్ల నీకు దూరమయ్యాను శాంతీ! ప్రతి క్షణం నీతలపులే, నీ అనుభూతులే నన్ను వేధిస్తున్నాయి. అశాంతిని కల్గిస్తున్నాయి శాంతీ!' బాధతో నుదురు కొట్టుకున్నాడు.

షెల్ఫులోని బుక్కు చేతిలోకి తీసుకుని వెన్నెల్లోకి నడిచాడు. శాంతి ఉత్తరంలో నుంచి తొంగిచూస్తోంది.

'బావా!

నీ మానసిక బలహీనత నాకు తెలుసు.

తినడం తెల్సుగానీ వీధిపంపుకెళ్లి ఓ బిందెడు నీళ్లు పట్రాడం తెలీదా?



## మిథ్యాబింబాలు

అది ఎంతటి పతనానికైనా దారితీస్తుంది. నా సుఖమేకాదు బావా నేనుకోరేది. నీ సుఖం కూడ. అందుకే మనసారా నిన్నొక కోరిక కోరతాను. నా మీద నీకే మాత్రం ప్రేమాభిమానాలున్నా నా కోరిక తీరుస్తానని ప్రమాణం చెయ్యి...మరి అడగనా! నీ జీవితంలో ప్రవేశించబోయే అదృష్టవంతురాల్ని, నీ మానసిక సంచలనానికి, బలహీనతకూ గురి చెయ్యద్దు. పాపం దాంపత్యం గురించి ఎన్నెన్నో కలలు కంటూ, నీ దగ్గర స్వర్గ సౌఖ్యాలనూ చవిచూడాలని, నిండుమనసుతో నీ పొందు కోరే నీ అర్ధాంగిని, ఏ విషయంలోనూ చిన్నబుచ్చకు. నీ జీవితాన్ని నరకం చేసుకుని...మరొకరి జీవితాన్ని కూడ నాశనం చెయ్యద్దు...!'

చెయ్యనని ప్రమాణం చెయ్యి బావా...!'

శాంతి ఎదుట నించుని అడుగుతున్నట్టుంది.

'శాంతీ! నువ్వు దేవతవు శాంతి... దేవతవి' అర్థంకాని వేదనతో తల్లడిల్లిపోయాడు. విపరీతమైన మానసిక సంఘర్షణ మధ్య నలిగిపోయాడు.

క్రొత్త రవి పైకి లేచాడు.

'లక్ష్మీ...!' క్రొత్తగా ఆప్యాయంగా పిలుస్తుంటే సంభ్రమంగా కన్నీటిని తుడుచుకుని లేచినిలబడింది. అద్దాల చెక్కిళ్ళు వాడి వున్నాయి. ఎర్ర కలువల్లాగా మెరుస్తున్నాయి కళ్ళు.

'చిరాకులో ఏదో అన్నానని బాధపడుతున్నావా!...'

జల జలా కన్నీరు రాలాయి.

'ఛ! పిచ్చిపిల్లా! దీనికేనా ... చూడు మొహమెలా వాడి పోయిందో!'

దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు.

సిగ్గుతో మొగ్గై రవిలో ఒదిగిపోయింది. విరజాజులు గర్వంగా సువాసనలు వెద జల్లుతున్నాయి.

'నీ ప్రమాణం నిలబెట్టాను కదు శాంతీ.'

బరువుగా నిట్టూరుస్తూ లక్ష్మి తలపైన తల వాల్చుకున్నాడు.

* * *

'డాక్టర్! నేనెవరో గుర్తున్నానా...?'

ఉలిక్కిపడి తలపైకెత్తిన వేణు నిర్విణ్ణుడై పోయాడు.

'అదేమిటి? దెయ్యాన్ని చూసినట్టు చూస్తావేం!' గల గలా నవ్వుతోంది.

'అవును అదేనవ్వు. అదే రూపు 'జానకీ..' ఆశ్చర్యంతో విస్మయంతో చూశాడు.

'హమ్మయ్య గుర్తొచ్చాను కదా. ఇంక ఫరవాలేదు!' తృప్తిగా నిట్టూర్చి కుర్చీ జరుపుకూర్చుంది.

'ఇదేనా రావటం? ఒంటరిగా వచ్చావేం?'

'ఏం! రాకూడదా? అయినా ఒంటరిగా వచ్చినా నాకేం నీదగ్గర అపకారం జరగటం లేదుగా!'

'నువ్వు మారినా నీ మాటలు మారలేదు జానకీ!'

'నే మారానా! లేదే...నువ్వే బాగా మారిపోయావు. ఇది వరకన్నా కూడ అందంగా హుందాగా, గంభీరంగా...'తనవే మనసారా చూస్తున్న జానకిని చూసి తల వాల్చుకున్నాడు.

'మీ ఆవిడని చూడాలని వచ్చాను!'

టేబిల్ పైనున్న స్టెత్‌ను చేతిలోకి తీసుకుంటూ తనవే ఓరగా చూస్తూ అంది. చిన్నగా నవ్వాడు వేణు.

'అదే నీ దగ్గరుంది. నే నెంతో సీరియస్‌గా అడిగితే నవ్వుతావేం,' ఉడుక్కుంది.

'నే నింకా పెళ్ళి చేసుకోలేదు జానకీ.'

ఒక మెరుపురేఖ మెరిసి క్షణంలో మాయమైంది.

'అప్పుడే నీకు పెళ్ళెందుకు? పగలంతా ఆపరేషన్లు, రాత్రంతా కథలూ, కైమెక్కువుంటుంది నీకు...అది సరే ఇంకా కథలు వ్రాస్తున్నావా నువ్వు!'

'వ్రాయకుండా ఎలా వుంటాను?'

తమాషాగా నవ్వింది జానకి. 'నీలోనే సర్జనూ, కవి, ఇంకా కాపురం చేస్తున్నారా? ఎప్పుడూ పోట్లాడుకోటంలా?'

'...........!'

అప్పుడే, మీకు మనసనేదసలుంటేగా. మీ మాటలకూ చేతలకూ అసలు పొలికే వుండదు. అవునా!'

ఛెళ్ళున కొరడాతో చరిచి నట్టయింది.

తను మెడిసన్ చదివేరోజుల్లో తనున్న ఇంటి వారమ్మాయి జానకి. అతి చనువుతో చొరవతో తనకెంతో చేరువైంది. జానకి సౌందర్యం తన కలంలో నిండి, కాగితం మీద విచిత్ర కాంతుల్ని వింత సోయగాలని అందుకునేది. జానకే తన కవితకు ఆధారం. జానకే తన జీవం. ఒక్కరోజు ఆమె కన్పించకపోతే తన కలం ఆగిపోయేది. ఆమె బాల వితంతువని తెల్సినా మమకారం అనురాగం పెంచుకున్నాడు. కాని పెద్దలకి సంఘం కట్టుబాట్లకి తల వంచాడు.

బావ ఉక్రోషం ఆపుకోలేక తనకంటే మానసికంగా ఉన్నతుడైన వ్యక్తిని చేసుకుంది జానకి. మనసు తనదగ్గరే వుంచి తనువుతో వెళ్ళిపోయింది. తిరిగి ఇన్నాళ్ళకి



కన్పించింది...'

'ఏమిటి నన్నెదురుగా పెట్టుకుని ఆలోచనలు?' తననే సూటిగా చూస్తోంది.

'ఆహా...ఏమీలేదు...చాలరోజులకి కన్పించావు కదూ. నిన్ను గురించి తెల్సుకోవాలని...!' తడబడ్డాడు వేణు. ఫక్కున నవ్వింది జానకి.

'అమ్మా! ఎంతైనా కవి కదూ. పైకెందుకు తేల్తావు? అలా డొంకతిరుగుడుగా అడక్కపోతే, 'నీ భర్త బాగా చూస్తున్నాడా. నీ కాపరం ఎలావుంది? ఎంత మంది పిల్లలు?' అంటు ముక్కుసూటిగా అడక్కూడదూ, చెప్పేదాన్ని ... మరి చెప్పిన తరువాత బాధపడకూడదు.

'కొందర్లా నీతులు వల్లిస్తూ, ఏదేదో సంస్కరిస్తామని వ్రాస్తూ అవసరం వచ్చినప్పుడు తోక జాడించే రకం కాదు మా ఆయన. నిజంగా మానవత్వమున్న మనిషి. నేనంటే ప్రాణాలు పెడతారు. పోతే మాకొక బాబు... అదీ సంవత్సరం క్రిందట్నే, పేరు వేణు...'' ఓరగా తననే చూస్తూంది...!

ఒక్కొక్క మాట శూలంలా గుచ్చుకుంటుంది

'ఇన్నాళ్ళకి, నీకొక పనిపెట్టొచ్చాను. అదైతే వెళ్ళిపోతాను. ఆ తరువాత నువ్వు తీరిగ్గా కథలు వ్రాసుకుంటూ...!' అర్థోక్తిగా ఆగిపోయింది.

ఏమిటన్నట్లు చూశాడు.

'నీచేతిలో చనిపోవాలని...!'

'ఛ ఏమిటా మాటలు!' మందలింపుగా చూశాడు.

'ఏం! ఎప్పుడో అప్పుడు చావాల్సిందేగా. ఎప్పుడో చావొచ్చేకంటే కోరుకున్నప్పుడు కోరుకున్నవాళ్ళ చేతిలో చావటం అదృష్టం కదూ!'

నిలేసి అడుగుతున్న జానకిని తెల్లబోయి చూస్తున్నాడు.

'నేను అతిథిగా రాలేదు. పేషెంటుగా వచ్చాను!'

ఎటో చూస్తూ భారంగా పలికింది.

'పేషెంటుగానా!' ఉలిక్కిపడ్డాడు.

'ఎందుకంత ఆశ్చర్యం! ఏం జానకి రోగి కాకూడదా...ఏదో ఆపరేషన్ చెయ్యాలన్నారు. నీచేతే చేయించుకోవాలని ఇంత దూరం అందర్నీ వదిలి వచ్చాను...' కన్నీళ్ళ గిర్రున తిరిగాయి.

'ఎక్కడ జానకీ! నీకు ఆపరేషనా? అసలేమిటి జబ్బు...!' ఆతృతగా లేచాడు.

'బావుంది. నాకేం తెల్సు...పరీక్ష చేసి నువ్వే చెప్పాలి.' స్క్రీన్ వెనుకకి నడిచింది.

* * *

బయాప్సీ రిపోర్టు వచ్చింది...

'మైగాడ్! జానకికి బ్రెస్ట్ కేన్సర్!

'............'

'భయంగా వుందా జానకీ!' ఆపరేషన్ థియేటర్‌కి వెళ్ళబోయేముందు జానకిని కల్సుకున్న వేణు కంఠంలో ఏదో ఆవేదన ధ్వనిస్తోంది.

'భలేవాడివే. భయమెందుకూ, నిండా మునిగిన వాడికి చలుండదట. అరే, నా కంటే నువ్వే భయపడిపోతున్నట్టున్నావే...ఇటువంటి వాడివి సర్జన్‌గా ఏం పైకొస్తావ్...' ఒక్క క్షణం మౌనం వహించింది. 'అది సరే...నాకు ఆపరేషన్ చేస్తావనుకో. ఆ తరువాత నేనే కారణంగానైనా చచ్చిపోతాననుకో ... మరి అప్పుడు కథలు వ్రాయగలవా నువ్వు?'

'జానకి!...ఏం మాటలవి ?' కటువుగా అనటానికి ప్రయత్నించినా ఆవేదన ఏదో మూలనుంచి తొంగి చూస్తోంది.

'అబ్బే ... ఇందులో తప్పేమున్నాను. నీ కవితకు నేనే ఊపిరంటివిగా. మరి ఆ ఊపిరే పోతే...' తమాషాగా నవ్వింది.

జానకంతే, మొండి ఘటం. చావబోతున్నా పరిహాసాలు మానదు.

'ఇంటినుంచి ఎవరూ రాలేదా !...' విషాదంగా నవ్వింది వేణు ప్రశ్నకి.

'ఎవరున్నారని రావటానికి ... అయినా అందరి పెట్టూ నువ్వున్నావుగా ఇంక నాకెవరు కావాలి !' మొండిగా అంటున్న జానకిని మౌనంగా మరింత నిశితంగా చూశాడు.

'అది కాదు. ఆపరేషన్ ముందు... మీ...!' అర్థోక్తిగా ఆగిపోయాడు.

అర్థమైనట్టుగా నవ్వింది జానకి. మా ఆయన పోయి రెండు సంవత్సరాలైంది. నీకు చెప్పిన నా బాబు వేణు అప్పుడే పుట్టిపోయాడు. అయినా ప్రతి నిముషం నాలో తిరుగుతూనే వున్నాడు. ఇంక అమ్మా నాన్నల్ని వదిలి వచ్చేశాను...'

నిశ్చేష్టుడై నిలబడిపోయాడు వేణు.

ఇంకా మనకి మనగా కన్పిస్తున్నా.. జానకి ఎదుట వెలుగుతున్న కుంకుమ దేదీప్య మానంగా ప్రకాశిస్తోంది

'నీకు ముందరంతా అబద్ధం చెప్పాను కదూ. ఏం చెయ్యను ... నిజ జీవితంలో జీవించటం దుర్భరమనిపించి కలల్లోనే జీవిస్తున్నా... మరి నువ్వు అంతేగా .!'

విలేసి అడుగుతోంది జానకి. అక్కడ వుండలేక గంభీరంగా థియేటర్లోకి వడిచాడు.

ఆపరేషన్ టేబిల్ మీద జానకి పడుకుని వుంది. వేణు డ్రస్ మారుస్తుంటే అదోలా చూస్తోంది. కళ్ళకి గుడ్డ కట్టబోతుంటే, ఆపరేషన్ డ్రస్‌లో టేబిల్ దగ్గరకి నిర్వి కారంగా వస్తున్న వేణుని జాలిగా చూసింది. మరుక్షణం కన్నీళ్ళు మెరుపులా మెరిశాయి

జానకి కూడ కంట తడి పెట్టుకుంది. ఒక్కక్షణం చలించాడు వేణు.

ఎనస్తీషియా ఇచ్చారు మత్తులో వొరిగి పోయింది జానకి. పమిట తీసివేసి ఆపరేషన్ చేయవలసిన భాగం మౌనంగా క్లీన్ చేస్తున్నాడు తనలోని కవితా హృదయాన్ని ఉద్రేక పరచి మనసంతా ఆక్రమించి, మధుర భావాలతో నింపివేసి, పిచ్చివాడ్ని చేసి, కవిగా తనని పెంచిన తన సౌందర్య దేవత సౌందర్యం తన చేతిలోనే శిదిలమై పోతోంది. తన కలంద్వారా ఎన్నో అవతారాలను దాల్చి ఎందరెందరి హృదయాలలోనో చెరగని ముద్ర వేసుకున్న ఒక అసమాన సౌందర్య రాశిని అతి దారుణంగా గాయపరచ బోతున్నాడు '

స్కాల్పెల్ పైకి తీశాడు చెయ్యి విప రీతంగా వణుకుతోంది

'భగవంతుడా నాకీ స్థితిని తెచ్చిపెట్టావే!' అసిస్టెంట్సు వేణులోని పరిణామాన్ని వింతగా చూస్తున్నారు. మనసు రాయి చేసుకున్నాడు వేణు. నిర్దాక్షిణ్యంగా అతి దారుణంగా మెరుస్తున్న స్కాల్పెల్‌ను ఓ క్షణం చూశాడు. మరుక్షణంలో సర్రున చర్మాన్ని చీల్చిందది. చివ్వున రక్తం పైకి చిమ్మింది మాంసపుగడ్డ వికృతంగా తొంగి చూస్తోంది

వేణులోని కవి గట్టిగా కళ్ళు మూసు కున్నాడు.

వేణు విపరీతంగా చలించిపోయాడు.

'సిస్టర్! స్వెట్‌పాడ్!' అసిస్టు చేస్తున్న సిస్టర్ కేకతో మరొక సిస్టర్ పరుగు



పరుగున వచ్చి స్వెట్‌పాడ్ వేణు నుదుటికి తట్టింది. భయంకరమైన నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఫాన్సు రివ్వున తిరుగు తున్నాయి. హృదయం విపరీతంగా చలి స్తుంటే తిరిగి ఉపక్రమించాడు.

కవి హృదయం బాధగా మూల్గింది. కరడు కట్టింది వేణు హృదయం. చేతులు చక చకా సాగిపోతున్నాయి రసికులు కళో పాసకులు, సౌందర్యారాధకులు హర్షించని పని వేగు చేస్తున్నాడు. కానీ వీరందరూ తనలోనే వున్నారు. తన హృదయావేదన వినకుండా వేణు అసమానమైన నిగ్రహం చూపుతున్నాడు.

చాలభాగం కోసివేశాడు నిర్వికారంగా రక్తపు ముద్దలను బేసిన్లో పడేస్తున్నాడు 'సిస్టర్. కాట్ గట్!' గంభీరంగా ధ్వనిం చింది వేణు కంఠం. సూచర్స్ కోసం కాట్ ట్ సూదిలోకి ఎక్కిస్తోంది సిస్టర్. ఒకసారి నిశితంగా చూసిన వేణు చూపు మరల్చాడు.

సూదితో దారం, కవితతో ప్రాణం ఎంతవరకు నిలుస్తుంది .!

చాలాభాగం తీసివేయగా నెత్తురు ముద్దగా మిగిలి వున్న భాగాన్ని చూస్తు న్నాడు ఈ రక్తపు గడ్డలకూ, చర్మపు తొడుగులకేనా కవులు ఎన్నెన్నో అందాలను అందిస్తారు? ఈ కృత్రిమ సొష్టవాలకేనా




మహామహులే పిచ్చివారైపోతారు! గుప్పెడు ప్రమాణంలో వుండి కాలం మూడేదాకా కొట్టుకునే ఈ గుండెలోనేనా, హృదయం, ప్రేమ, ఆరాధన అనురాగం అవే అమృ తాన్ని నింప ప్రయత్నిస్తారు!

కవులెంత పిచ్చివారు... ! విరక్తిగా నవ్వుకున్నాడు.

ఇటువంటివే ఎన్నో ఆపరేషన్స్ నిర్వికా రంగా చేయగల్గినా అన్ని అనుభూతులకూ దూరంగా వుండాలని ప్రయత్నించి ఫలితం సాధించాడే... మరి ఇంతటి మానసిక వ్యథ తనెప్పుడూ అనుభవించలేదే ప్రతీ నిముషం తన హృదయాన్ని వ్రక్కలుచేసే ఈ అను భూతులు తనని వదులుతాయా? జానకికి తనలో గల పవిత్రస్థానం ఇంతటి బలమై నదీ ఇంతటి పటుత్వమైనదీనా!

రవి, లక్ష్మి, శాంతి ఇంకా జానకి ప్రతి రూపులుగా జానకి సౌందర్య చిహ్నాలుగా తన చేతినుంచి ప్రాణాలు పోసుకున్న ఎంద రెందరో ... తన చుట్టూ తిరుగుతూ వికటాట్టహాసం చేస్తున్నారు తనని పరిహ సిస్తున్నారు వికృతంగా నవ్వుతున్నారు... తన మనో దౌర్బల్యాన్ని సవాలుచేసి మరీ చూస్తున్నారు వేణు హృదయం తూట్లు పడుతోంది.

'డాక్టర్! యు ఆర్ నాట్ వెల్ ఐ థింక్ ఇఫ్ యు డోంట్ మైండ్ ఐ విల్ కంటిన్యూ ద ఆపరేషన్!' వేణు పరిస్థితి అర్థంచేసి అసిస్టెంట్ నమ్రతగా అన్నాడు. ఈ లోకానికి వచ్చాడు వేణు.

'నో! థాంక్యూ!' మనసు మరింత రాయి చేసుకున్నాడు.

ఆపరేషన్ పూర్తయింది.

*   *   *

తను వ్రాస్తున్న అసంపూర్తి నవలను పూర్తిచేయటానికి పెన్ తీశాడు...! ఎంత నిగ్రహించుకున్నా జానకే కళ్ళకు కన్పి స్తోంది. పెన్నుతో కాగితంమీద పిచ్చి గీతలు గీస్తూ వుండిపోయాడు తన మన సుకూ చేతలకూ ఏమైనా సంబంధం వుందా! తన మానసిక బలహీనత నీవాడు తన ప్రియురాలు ఎత్తి చూపుతోంది...

ఏమైనా ఈ ద్విపాత్రాభినయంతో తనను తనే వంచించుకుంటున్నాడు.

సర్జన్, కవి, తనలో ఇమడలేమని ఘోషిస్తున్నారు.

సీరియల్





సి. ఆనందారామం

## జరిగిన కథ

వారిజ ఆ వూరికి కొత్తగా వచ్చింది. రామచంద్రని ఆకర్షించింది. అతనిని ఇంటికి ఆహ్వానించింది. ఆమె వివరాలు సేకరిద్దామనుకున్న రామచంద్ర ప్రయత్నం ఫలించదు. వారిజ అతనిమీద అనురాగాన్ని ప్రకటించినా అర్థం చేసుకోలేకపోతాడు. అతనికి తెలిసిందల్లా ఒకటే. ఆమె మెడలో నల్లపూసలున్నాయి. ఆమెకి పెళ్ళయింది. తను దూరంగా వుండాలని అతను అనుకోకుండా ఆమెకు దగ్గరవుతాడు. ఆమెతో పొలాలమధ్య తిరుగుతాడు. నల్లపూసలు సరదాకి కట్టుకొన్నానని తెలిసినతర్వాత ఆమె గత చరిత్ర ఏమిటో తప్పక తెలుసుకోవాలనుకుంటాడు.

పార్వతి సత్యనారాయణ దంపతులకి నాలుగో సంతానం వారిజ. ఆమె మాధవితో కలిసి మద్రాసు వెళ్తుంది. సినిమాతారగా విసిగిపోయి ఆ వూరికి వస్తుంది.

## 5

తింటోన్న అన్నంలో చెయ్యికడుక్కుని లేచి పోయాడు రామచంద్ర—

'బాబు! ఇంక చెప్పకండి—వినలేను—'

అంటూనే బయటికి నడిచాడు—

ఆవేదనతో అడ్డపడింది వారిజ —

'ఇలా తింటోన్న అన్నం మధ్యలో వదిలి వెళ్ళటం మీకు న్యాయంకాదు—నేనెంత బాధపడతానో ఊహించలేరా?'

రామచంద్ర నవ్వాడు—

'ఊహించగలను — నటించడం బాగా చేతనయినవారు. ఎంత బాధయినా పడగలరు—'

వారిజ ముఖం పాలిపోయింది—

'నమ్మకండి — నన్నూ, నా మాటల్నీ నమ్మద్దు—నేనేం కోరుతున్నాను మిమ్మల్ని? నన్ను ప్రేమించమనటం లేదు—పెళ్ళిచేసుకోమనటం లేదు—ఒక స్నేహితురాలిగా అంగీకరించమంటున్నాను—ఆత్మీయమైన స్నేహానికి వ్యక్తిగత చరిత్రలతో సంబంధమేముంది? మన జీవితాలు పెనవేసుకున్నప్పుడు కదా, వ్యక్తిగత చరిత్రలతో సంబంధం?'

'స్నేహం! ఆత్మీయత!—ఇలాటి మాటలు వాడి ఆ మాటల గౌరవాన్ని పాడుచెయ్యవద్దు వారిజా! నన్ను వెళ్ళనివ్వండి—'

వారిజ పెదవులు వణికాయి.

'కనీసం నిర్మలమైన స్నేహంచేసే అర్హత కూడా లేదా నాకు?

'అర్హతా!? మీ కన్న ఎక్కువ అర్హత ఎవరికుంటుంది? ఐశ్వర్యం, సౌందర్యం, బోలెడు ప్రఖ్యాతి,— మీరు కొద్దిగా కనుసైగచేస్తే కోట్ల కొలదీ స్నేహితులు మీ పాదాలమీద వాలతారు— కావలసినంత నిర్మలంగా స్నేహం చెయ్యొచ్చు. నాను దారి వదలండి—'

'ఏదో నా స్నేహాన్నికూడా అంగీకరించకండి—కానీ, ఇవాళ ఒక్కరోజుకి ఇక్కడ ఉండండి—భోజనం చెయ్యలేదు—కాఫీ ఫలహారాలు తీసుకుని వెళ్ళండి—' రామచంద్ర ఆగి వారిజ ముఖంలోకి తీక్షణంగా చూశాడు—

'వారిజా! నేను నీ అందానికి వ్యామోహితుడి నయ్యానని అనుకుంటే అది భ్రమ—నువ్వు నమ్మలేకపోవచ్చు—కనీసం ఊహించలేకపోవచ్చు—కానీ, నేను సగర్వంగా చెప్పుకుంటున్నాను— ఎటువంటి వ్యామోహానికీ లొంగేవాడిని కాను నేను — ఆనాడు ఆ ఉదయ సంధ్యలో ఏదో దేవీమూర్తిలా కనిపించావు నువ్వు నా కంటికి — ఆనాడు నీముఖంలో కనిపించిన అమాయకత్వంచూసి ఆశ్చర్యపోయాను—పసిపాపలా నీలో నువ్వు నవ్వుకుంటున్నావు—ప్రకృతిలో ఒకభాగంగా కలిసిపోయిన తపస్వినిలా అనిపించావు — ఆనాడయినా నీ మెడలో నల్లపూసల్ని చూసి దూరంగానే ఉన్నాను—అయినా ఏదో శక్తి బలంగా నన్ను నీవైపుకు ఆకర్షించింది—నీ ప్రతిమాట ప్రతిచర్య నాలో అణువణువునా మాధుర్యాన్ని నింపింది—పిచ్చివాడి నయిపోయాను—నువ్వు అవివాహితవని తెలిసిననాడు నా ఆనందానికి అవధులు లేకుండా పోయాయి—నిన్ను దగ్గరకు తీసుకుని నన్ను నేను మైమరచుకున్నాను — నిన్నటిదాకా నా అంత అదృష్టవంతుడు లేడని మురిసిపోయాను—దురదృష్టవంతుణ్ణి—ఇప్పుడింత మోసగత్తెవని నాకు తెలుసు'

'మీ యిష్టం వచ్చిన మాటలనండి పడతాను— కానీ, మీరు గడిపిన జీవితం

మాత్రం నటనకాదు—మొదట మీరు నన్ను వివాహిత అనుకొంటున్నప్పుడు ఏం చెప్పలేక అలాగే నటించాను— అంతే! అంతవరకూ జీవించటంకోసం నటించాను — ఆక్షణం నటనలో జీవించటం మొదలుపెట్టాను— మీ సాహచర్యంలో జీవితమంటే ఏమిటో తెలుసుకున్నాక మీ ముందు నటించగలిగే శక్తి లేకపోయింది — ప్రతి మాటా, ప్రతీ చేష్ట, నాగుండెల లోతులలోనుండి వచ్చినవే!

'నిన్ను మాటలనటానికి నేనెవర్ని వారిజా! అతి సమర్థురాలయిన నటివి- ఏది నటనో ఏదికాదో ఎవరు చెప్పగలరు? అయినా అంత తేల్చుకోవలసిన అగత్యం నాకేం వచ్చిందీ? వెళ్ళనియ్యి—'

వారిజ గబుక్కున రామచంద్ర చేతులు పట్టుకుని

'ఒక్కక్షణం .' అంటూ ఏదో అన బోయింది—

ఆ చేతులు విదిలించి కొట్టాడు రామచంద్ర—

'ఛీ? వారిజా! నీ స్పర్శకోసం ఆశపడే అధముణ్ణనుకొంటున్నావా? కామోద్రేకాన్ని రెచ్చగొట్టి నన్ను లొంగదీసుకోవాలను కుంటున్నావా?'

'కాదు కాదు .'

వెంటనే అడ్డులేచిపోయింది వారిజ—

విసురుగా వెళ్ళిపోయాడు రామచంద్ర—

ఆరోజు రామచంద్రకోసం స్వయంగా ఎన్నెన్నో తయారుచేసింది వారిజ—అవన్నీ అలాగే ఉన్నాయి—మళ్ళీ వంటింట్లోకెళ్ళ డానికి భయంవేసింది వారిజకి — అక్కడే అలా కూలబడిపోయింది—

ప్రయాణానికి సిద్ధమయి టాక్సీలో కూర్చున్నాక ఒక్కసారి రామచంద్రకు చెప్పిరావాలనే కోరికను అణచుకోలేక పోయింది వారిజ—

టాక్సీని రామచంద్ర ఇంటిదగ్గర ఆపమని వణికే కాళ్ళతో దిగి లోపలికి వెళ్ళింది—

అడుగుల చప్పుడుకు పరధ్యానంలో ఉన్న రామచంద్ర ఉలికిపడి చూసాడు—ఒక్కరోజు లోనే అతని కళ్ళలో ఎంతో దైన్యం కనిపించింది—అలా శూన్యంగా వారిజ వంక చూస్తూ ఉండిపోయాడు—

ఆ చూపులకు తట్టుకోలేక పోయింది వారిజ— చటుక్కున క్రింద కూలపడి వెక్కి వెక్కి ఏడ్చింది—

'ఏందుకేడుస్తావ్?' నిదానంగా అడిగాడు రామచంద్ర—'నటన' ప్రసక్తి రానందుకు.. పొంగి పోయింది వారిజ హృదయం—

'ఇంకా ఏడవగలిగే శక్తి మిగిలి ఉందన్న ఆనందంతో ఏడ్చాను—వెళ్ళుతున్నాను— నన్ను క్షమించం —బాగా ద్వేషించండి — త్వరలో పెళ్ళి చేసుకుని సుఖంగా జీవించండి — స్వార్థపరురాలిని—మీకు కష్టం కలుగు తుందని తెలిసినా ఒక్కసారి మిమ్మల్ని చూడటానికి వచ్చాను—వెళ్ళుతున్నాను—' లేచి బయటికి వచ్చింది వారిజ—కలలో మనిషిలా హిప్నొటైజ్ చెయ్యబడ్డ వాడిలా—తనూ



లేచి గుమ్మందాకా నడిచాడు — టాక్సీలో కూర్చుని తలెత్తి చూసింది వారిజ— రామచంద్ర వారిజనే చూస్తున్నాడు— అతని కళ్లలోనూ లీలగా బిందువులు కదిలాయి — చేతులెత్తి నమస్కరించింది వారిజ — అతను చటుక్కున తలదించుకున్నాడు—టాక్సీ కదిలింది——

'చాలు! నాకీ అదృష్టం చాలు!' సంతృప్తిగా అనుకుని నిండుతున్న కళ్ల మీదికి బరువైన కనురెప్పల్ని వాల్చుకుంది వారిజ

* * *

వారిజ సినిమారంగం నుంచి విరమించిందన్న వార్త అందరినీ దిగ్భ్రాంతుల్ని చేసింది — ఎందరెందరో వచ్చి వారిజకు ఎన్ని విధాలుగానో నచ్చ జెప్పటానికి ప్రయత్నించారు—కానీ వారిజ తను పట్టిన పట్టు విడవలేదు—వారిజకు ఒక పెద్ద మేడ ఉంది దాన్ని అద్దెకిచ్చి చిన్న ఇంట్లోకి మారింది పాతిక రూపాయల అద్దెకి — మేడమీద నెల నెలా మూడువందలు అద్దె వస్తుంది, బ్రతకటానికది చాలు—వారిజకు చిన్నప్పటి నుంచీ పుస్తకాలు చదవటం అలవాటే! ఇప్పుడు మళ్లీ పుస్తకాలలో మునిగి పోయింది ఇదివరలోలా నవలలు మాత్రం చదవటం లేదు దీక్షగా మెట్రిక్‌కి చదువుతోంది—ఇంగ్లీష్ అంతగా రాదు కనుక తెలుగులో కనిపించిన మంచి పుస్తకమల్లా చదువుతోంది — బలివాడ కాంతారావుగారి 'గోడమీది బొమ్మ' చదివిన తరువాత ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు వారిజకి— దేవుడా! నాక్కూడా పెద్ద గుండె ఇయ్యి—' అని ఆక్రోశించింది — రోజూ ఉదయమే పూజ చెయ్యటం అలవాటు చేసుకుంది — అందరూ ఈ విషయాన్ని చాలా వేళాకోళంగా చెప్పుకున్నారు ఎవరి దాకానో ఎందుకు? వారిజకే తనపూజ తనకే ఒక పెద్ద వెక్కిరింతలా అనిపించేది — తను పూజ ఏమిటి? ఏమని ప్రార్థిస్తుంది దేవుణ్ణి? కానీ తరువాత తరువాత అర్థమయింది వారిజకి — అన్ని రకాలైన ఎస్కేపిజాలలో ఈ పూజ కూడా ఒకటని పరిష్కరించ లేనన్ని సమస్యలు చిందరవందర చేసేస్తుంటే భగవన్నామం జపించు కుంటూ తనను తను మరిచి పోవటం—

# చీకటి కడుపున...

ఈ ఎస్కేపిజం వల్ల లాభం ఉందో లేదోకాని నష్టం మటుకు లేదు—ధారణవల్ల మానసిక శక్తి తప్పక పెరుగుతుంది — ధారణ లేకుండ జపం సాధ్యంకాదు— ఆ రకంగా కొంత లాభం—

కానీ, వారిజకు పూజా, పుస్తకాలూ కాక మరో మధుర ప్రపంచం ఉంది— అది ఆవిడ ఊహాప్రపంచం — మొత్తం బతుకంతా ఒక మిథ్య అయిపోయింది వారిజకు—భావనలో బ్రతకటం నేర్చేసుకుంది — అదే ఆవిడకు నిజమైన బ్రతుకయిపోయింది—భావనలో ఎప్పుడూ రామచంద్ర సాన్నిధ్యంలోనే ఉంటుంది—రామచంద్రకు తనే వండుతుంది—వడ్డిస్తుంది— అతనికి బట్టలు సిద్ధం చేస్తుంది— బూట్స్ పాలిష్ చేస్తుంది—నవ్విస్తుంది— మురిపిస్తుంది—అతనిలో ఒక భాగంగా కరిగిపోతుంది—

మొదట రవికి ఇంటద్దెలో సగం నెల నెలా ఇచ్చేద్దామనుకుంది—కానీ రవిది ఏంతుంటే అంతా ఖర్చు చేసే స్వభావం అందుకని డబ్బు తనదగ్గరే ఉంచుకుని రవి అడిగినప్పుడల్లా పదీ, పదిహేనూ ఇయ్యసాగింది—రెండు రోజుల కొకసారైనా రవి రాకమానడు—

ఒకనాడు ఆనందంకోసం వెతుక్కుంటూ ఎంతో అశాంతినీ, చిదరనూ జుగుప్సనూ అనుభవించింది—ఈ నాటికి అర్థమయింది వారిజకు—ఆనందం వెతుక్కోవలసిన అవసరం లేనేలేదని—అది సృష్టి అంతటా నిండి ఉందని—

వెర్రి ఆనందంతో వీచేగాలీ, పరవశించి ఊగే కొమ్మలూ, సంధ్య ఎర్రని అంచులతో నీలంగా మెరుస్తూ వయ్యారాలు పోయే మబ్బులూ, మురిపిస్తూ కురిసే మంచు జల్లులూ—ఆనందం ఎక్కడలేదు?

ఒకొక్కసారి అర్ధరాత్రిలేచి చీకట్లోకి చూస్తూ కూర్చునేది—

అందరూ చీకటిని ఎందుకంత భయంకరంగా వర్ణిస్తారు?

కష్టాలకూ దుఃఖాలకూ చీకటిని ఉపమానంగా తేవటం కవి సమయం ఎలా అయిందీ?

ఎంత నిండుగా గంభీరంగా ఉంటుంది చీకటి? ఈ చీకటి లేకపోతే ఆ తారలు అంత తళ తళ లాడగలిగేవా? జగత్తుకి వాటి అందాలు తెలిసేవా? ఎలాంటి కష్టాలకైనా సహించి నిలిచే ధీరోదాత్తుడి చిరునవ్వులా ఉంటుంది విశాలంగా పరుచుకున్న చీకటి—

ఈ చీకటిని చూస్తే ప్రాణులకు భయం—చీకట్లో ఏదీ తెలియదు—ఈ తెలియనితనంలోనే ఉంది భయమంతా—

అంతా తెలిసితే తెలియటం అంటే?

తెలియటం అంటే విజ్ఞానమని కాదు— మనసు పరిణతి పొందిన ఒక దశ—ఆశలూ నిరాశలూ కలిసిపోయిన దశ—వెల్లువలా పొంగే మమకారం ద్వేషాలన్నింటినీ మింగేయగల దశ—

ఆత్మ తృప్తి ముందు ప్రలోభాలన్నీ తృణ ఖండికలుగా తోచే దశ—

మమత మేలుకొల్పిన మానవత్వంతో సృష్టి సర్వంలోనూ మాధుర్యమే చూడగలిగిన దశ—

ఆ దశకు చేరుకోగలిగిన ధన్యులకు చీకటి కూడా అందంగానే కనిపిస్తుంది— వెన్నెల జల్లులోనూ, చీకటి విక్రమం లోనూ ఒకేలా పరవశించగలుగుతారు—

తాను ఆ దశకు చేరుకోగలిగినట్లా?

నవ్వుకొంది వారిజ— లేదు చేరుకోలేదు కాని ఆ దశ తనకు స్పష్టంగా కనిపిస్తోంది — అందుకే చీకట్లోనూ అందం కనిపిస్తోంది—ఇంకా ఆ దశ చేరుకోలేదు—అందుకే చీకట్లోకి వెళ్లలేదు నిర్భయంగా హృదయం బలహీనతలతో ప్రలోభాలతో సంఘర్షిస్తోనే ఉంది—

మనసు ఏవేవో ఆశలను అల్లుకుంటూనే ఉంది — క్షణిక భావోద్వేగాలకు శరీరం స్వాధీన మవుతూనే ఉంది

చిరాకు, కోపం, అసహ్యం, కసి, ఇవి క్షణికంగా తనను వశపరచుకుని రాజ్యం చేస్తూనే ఉన్నాయి — అందుకే తనకింకా చీకటి కడుపున దాగిన కాంతి దర్శనం లభ్యం కావటంలేదు—

మెట్రిక్ పరీక్షలురాసి నవారు మంచం మీద పడుకుని రామచంద్రను ధ్యానించుకొంటూన్న వారిజ రవి రాకతో విసుగ్గా లేచి కూచుంది —

'ఒక్కసారి ముందు గదిలోకిరా, వారిజా! నీ కోసం ఎవరో వచ్చారు —' అన్నాడు




# ఆహ్లాదకరమైన పరిమళము మరియు తాజావంతమైన అద్భుత అనుభవాన్ని పొందుతారు

ఆ చల్లదనం రోజంతా వుంటుంది...ఎక్కువ సేపు నిలిచే పరిమళము ప్రోత్సాహముగునా ఉత్సాహాన్ని చేకూరుస్తుంది. పట్టువలె మృదువైన, శాటిన్ వలె నునుపైన కుటికురా టాల్కం పౌడరు చల్లుకొనిన ప్రతిసారి పూర్తిగా మీదే.

కొద్ది ఔషధము కలుపబడిన కుటికురా మీ చర్మానికి అవసరమైన మృదు సంరక్షణను కలిగిస్తుంది. చెమట పొక్కులు, వాసనవలనచే చెమట మరియు చర్మపు చికాకు వల్ల కలిగే హానినుండి రక్షణను కలిగిస్తుంది. క్రమబద్ధంగా వాడేటట్లయితే కుటికురా మీ ముఖవర్చస్సుకు సౌందర్యాన్ని చేకూరుస్తుంది.

పసిపాపకు కూడా సుఖాన్ని చేకూరుస్తుంది... పసిపాప మృదువైన చర్మము మీద సున్నితంగా పనిచేసి పాప చర్మాన్ని మెత్తగాను, ఉపశమనకరముగాను ఉంచుతుంది.

నేడే ఒక కుటికురా డబ్బాను కొనండి.




కుటుంబానికంతటకూ బహుళ ప్రయోజనకరమైన టాల్కం పౌడరు

NAS

రవి —

'నాకోసం వివరొస్తారు? పంపెయ్యి—'

'అలా కాదు — ఒక్కసారి వచ్చి చూడు — నిన్ను చూడందే వెళ్ళనంటు న్నారు—'

అంతవరకూ రామచంద్రనే ధ్యానిస్తోన్న వారిజకు అతడు 'రామచంద్రా!' అని అనుమానం కలిగింది — ఆశతో ముందు గదిలోకి వచ్చింది — ఉసూరుమంది — అత డెవరో అపరిచిత వ్యక్తి — రామచంద్ర తన ఇంటికి వచ్చే అదృష్టం కూడానా! ఎంత ఆశ, బేలమనసుకి!

ముభావంగా నమస్కారం చేసి కూర్చుంది —

అతడు గొంతు సర్దుకుని ప్రారంభించాడు —

'నేను కొత్తగా సినిమా తియ్యబోతున్నాను— మీ కోసం '

'క్షమించండి నే నింక సినిమాల్లో వెయ్యను—' మొండిగా అంది వారిజ —

'అమ్మమ్మ! అలా అనకండి — మీకెంత కావాలంటే అంత ఇస్తాను — మీరు సినిమాలో వేషం.'

మీరు ఎంతఇచ్చినా నాకక్కర్లేదు—మీరు వెళ్ళండి—'

గుమ్మంవైపు వేలు చూపిస్తూ తీక్షణంగా అంది — పాలిపోయిన ముఖంతో అతడు వెళ్ళిపోయాడు —

'ఏవిటి వారిజా! మహారాజాగా గుమ్మంలో కొచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకుంటావ్?'

నిష్ఠూరంగా అన్నాడు రవి —

వారిజ భగ్గుమంది —

'మూర్ఖుడివి నువ్వు — నీకు అర్థం కాదు — పోనీ, నేను చెప్పినట్లు వినవు— అసలతన్ని ఎందుకు తీసుకొచ్చావ్?—'

రవికికూడా చాలా కోపంవచ్చింది— నిష్కారణంగా వేలకివేలు డబ్బొచ్చే వృత్తి వదిలేసినందుకు —

'అర్థం కాకపోవటమేం? అన్నీ అర్థమవుతునే ఉన్నాయి, నువ్వు పెద్ద భక్తురాలివి అయిపోతున్నావు? పరమ పతివ్రతా శిరోమణిగా మారిపోదామని చూస్తున్నావు— నువ్వు పూజలుచేస్తే భగవంతుడు నీ పాపాలన్నీ కడిగేస్తాడా? నరకంలో అగ్ని జ్వాలల మధ్య మాడ్చడానికి బదులుగా సరాసరి స్వర్గంలోకి తీసుకుపోతాడా? నువ్విప్పుడు పతివ్రతా శిరోమణిగా మారినంత మాత్రాన నీకు మొగుడొస్తాడా? నీ గతాన్ని ఎవరు మరిచిపోతారు? ఇంకా సినిమాస్టార్‌గా ఉంటేనన్నా నీ సంపాదనకు ఆశపడి ఎవరో ఒకరు పెళ్ళిచేసుకుంటారు —'

వారిజ మనసు ఈ విషానికి కుత కుత ఉడికింది —

'నరక జ్వాలలకు భయపడి నేను భగవంతుడిని పూజించటంలేదు — నాచుట్టు ప్రక్కలనున్న మీరంతా నా కాళ్ళక్రింద పెడుతోన్న మంటలకు ఏ నరక జ్వాలలూ సాటిరావు — 'నా చుట్టుప్రక్కల వారి క్షుద్రత్వాలకు చికాకు పడకుండా అందరినీ ప్రేమించగలిగే శక్తినియ్యి భగవంతుడా!' అని ప్రార్థిస్తున్నాను— లోకంలో మంచివాళ్ళు ఎందరో ఉన్నారు — కనీసం ఆ మంచిని అర్థంచేసుకు గౌరవించగలిగే సంస్కారాన్నియ్యమని ప్రార్థిస్తున్నాను — వేగిపోతున్న నా మనసుకు ఆ ప్రార్థనలో తాత్కాలికంగా కొంత ఉపశాంతి దొరుకుతోంది గనుక ప్రార్థిస్తున్నాను — అంతే! నా పాపాలకి తప్పకుండా నరకంలోకి వెళ్ళి ఆ శిక్షలన్నీ అనుభవిస్తాను — ఈ లోకంలో ఇంత అనుభవించిన నాకదో లెక్క!

నువ్వన్నట్లు నాకు మొగుడు కావాలనుకుంటే సినిమారంగంలోనే ఉండేదాన్ని — నా కిక ఈ జీవితంలో మొగుడు అక్కర్లేదని నిర్ణయించు కున్నాను గనకనే పవిత్రంగా బ్రతకటానికి నిర్ణయించుకున్నాను — నన్నంటిని మాలిన్యం నన్ను వదలదని తెలుసు — కానీ నిష్కారణంగా నన్ను నేను పెట్టుకొంటోన్న చిత్రహింస నుండి విముక్తి లభించింది — అది చాలు నాకు — నేను పవిత్రురాలినని ఎవరూ అనుకోనక్కర్లేదు — ఒకవేళ ఎవరైనా మూర్ఖులు అనుకున్నా నేను పవిత్రురాలిని కానని నేనే చెప్పుకుంటాను — కానీ, నా అన్నవయి నందుకు నన్నురక్షించడానికి మారుగా స్వార్థం కోసం నన్ను మరింత కూపంలోకి తొయ్యడానికి ప్రయత్నిస్తున్నావు — మన సన్నిధిఉంటే సిగ్గుపడు —'

లోపలి గదిలోకి వెళ్ళిపోయి ధభాలున తలుపు వేసేసుకుంది వారిజ —'

* * *

కల్యాణికి నలభై రెండేళ్ళు నిండినా ఇంకా యౌవనం ఆవిడను వదలలేదు —

శంకరానికి తమలపాకుల చిలకలు చుట్టిస్తూ 'ఒక్కసారి బెజవాడ వెళ్ళి రావాలని ఉందండీ!' అంది—

శంకరం నవ్వి 'ఏం? గాలి అటు మళ్ళింది?' అన్నాడు.

'ఆనాడు నాకు కనీసం తాంబూలమైనా ఇవ్వకుండా అవమానించింది పార్వతి






ఇప్పుడొక్కసారి వెళ్ళి ఆవిడని చూడాలని ఉంది –'

శంకరం ముఖం వడలి పోయింది–

'ఆవిడ ఏదో మూర్ఖంగా ప్రవర్తిస్తే చదువుకున్న దానివి నువ్వు కూడా తిప్పి కొట్టాలా? వాళ్ళు పూర్తిగా చితికి పోయారని విన్నాను– సత్యన్నారాయణ గారికి లాగుడు తప్ప ఇంకేం తెలియటం లేదుట– చచ్చిన పాముని ఇంకా కొట్టడం దేనికి?'

'నేనక్కడకు వెళ్ళి పాత సంగతులు తవ్వి దెప్పి పోస్తాననుకున్నారా? ఆ మాత్రం మానవత్వం లేదూ! ఊరికే ఒకసారి చూడాలని కుతూహలం! ఆ అహంకారం ఇప్పటికి ఏ పాళ్ళలో ఉందో చూద్దామని–'

'నీ ఇష్టం–అన్నీ తెలిసిన దానివి– నీకు నేను చెప్పాలా?'

'బాగుందండీ మీ ఇష్టం లేకుండ నేనేం చేసాను?'

'ఏం చెయ్యలేదు– నీ – ఇష్టాలే నా ఇష్టాలుగా మార్చేస్తున్నావు– అంతే!'

నవ్వింది కళ్యాణి –

'పోనీ, ఇందువల్ల మీరు నష్టపోయిం దేమిటో చెప్పండి–'

'నష్టపోయానని అంటున్నానా? ప్లీడర్ గుమస్తాని– కొడుకుని చదివించు కున్నాను–కూతురికి లక్షణంగా పెళ్ళి చేసాను– కొంత ఆస్తి కూడా సంపాదించు కున్నాను– ఇదంతా నీ మంత్రాంగ ఫలిత మేనని మరిచిపోలేనా?'

'చాల్లెండి–పొగడ్త–మీ సహకారం లేకుండా నేనేం సాధించగలను? ఏ సంసా రంలో భార్యాభర్తల మధ్య అనురాగమూ, పరస్పరం అర్థం చేసుకోగలిగే శక్తి ఉంటాయో, ఆ సంసారం అన్నివిధాలా వృద్ధిలోకొస్తుంది– భార్యా భర్తలమధ్య అన్యోన్యత లోపించిన సంసారాలు వృద్ధి లోకి రావటం అరుదు — ఈ అభివృద్ధి మన ఇద్దరి కృషి ఫలితమూ!'

'ధన్యోస్మి–నాకూ భాగం ఇస్తానం టోంటే నదే పోయి ది–ఇదంతా నా ప్రయోజకత్వమే అని మురిసిపోతాను–'

'ఇదంతా మామూలే కాని, బెజవాడ ఎప్పుడెళ్దాం?'

'నీ యిష్టం–రేపు వెళ్దామా?'

'రేపే వెళ్దాం–'

ఆ మరునాడే కళ్యాణి, శంకరం, బయలుదేరి బెజవాడ వచ్చి ఒక బంధువు

ంటోల్లో దిగారు—

భోజనం చేసి, ప్రయాణపు బడలిక తీర్చుకొని, ముఖం కడుక్కుని గుంటూరు నేత చీర కట్టుకుని ప్రయాణమయింది కళ్యాణి—

'ఆవిడకు నీ ఐశ్వర్యం చూపించాలని బయలుదేరుతూ ఆ నూలు చీర కట్టుకున్నావేం? నీ కొడుకు కొనిచ్చిన ధర్మవరం చీర కట్టుకో!'

కళ్యాణి మూతి ముడుచుకుంది—

'అదిగో! అలాంటి మాటలే అనొద్దన్నాను—నా ఐశ్వర్యం చూపించడానికి వెళ్ళడంలేదు—ఆవిడ అహంకారం ఎంతలో ఉందో చూడటానికి వెళ్తున్నాను—'

'సరే! జాగ్రత్తగా కొలిచి నాకు చెప్పు—'

బద్ధకంగా పడుకున్నాడు శంకరం —

'నేను సాయంత్రం వెళ్ళి సత్యన్నారాయణ గారిని చూస్తాను— ఆయనను కలుసుకోవాలంటేనే ఎలాగో ఉంది—'

ఒక్క నిట్టూర్పు విడిచాడు శంకరం—

రిక్షాలో బయలుదేరింది కళ్యాణి—

రిక్షాలో దిగుతోన్న కళ్యాణిని చూసి పార్వతి నిర్ఘాంతపోయింది—

పార్వతిని చూసి కళ్యాణీ అంతే విభ్రాంతి పొందింది—

ఇంచుమించు సమవయస్కులు కళ్యాణి, పార్వతి—

పార్వతి ముదివగ్గులా తయారయింది—శరీరం వణుకుతోంది—చర్మం ముడుతలు పడిపోయింది—కళ్ళు గుంటలు పడ్డాయి—

'కళ్యాణీ! నువ్వేనా!'

సంభ్రమంగా అంది పార్వతి—వణికే శరీరంతో తూలుకుంటూవచ్చి కళ్యాణి రెండుచేతులూ పట్టుకుని లోపలకు తీసుకొచ్చింది—

'నువ్వేనా కళ్యాణీ! ఎన్నాళ్ళకు చూసాను నిన్ను? కూచో! కూచో! ఒకప్పుడు పెద్ద ప్లీడర్‌గారి భార్యనని గర్వంతో కూర్చుందుకు నీకు సోఫా చూపించలేదు—ఈనాడు చూపిద్దామన్నా చిరుగు చాపతప్ప ఏంలేదు మాఇంట్లో!'—

పార్వతి కళ్లల్లో నీళ్ళు తిరిగాయి—

కళ్యాణి కదిలిపోయింది—

'ఫరవాలేదు పార్వతీ! ఎక్కడయితేనేం?'

అంటూనే చాపమీద కూర్చుంది—

# చీకటి కడుపున ...

'మేం ఇలా చితికిపోయిన తరువాత ఎవ్వరూ మాకేసి కన్నెత్తికూడా చూడలేదు—నువ్వు మా ఇల్లు వెతుక్కుంటూ వచ్చావు—నిజంగా నీది చాలా దొడ్డమనసు కళ్యాణీ!'

ఆప్యాయంగా అంది పార్వతి—కళ్యాణి సిగ్గుపడింది—పార్వతి పొగడ్తలకి కాదు—తన అంతరంగాన్ని తలుచుకుని—

'చాలా సంతోషం కళ్యాణీ! లక్ష్మీదేవిలా ఉన్నావు — ఎంతమంది పిల్లలు? ఏం చేస్తున్నారు?'

పార్వతి కంఠంలో ఆదరం ఆనందం తొణికిసలాడయి — కళ్యాణి మనసుకూడ ఆర్ద్రమయి పోయింది —

'ఒక కొడుకూ, ఒక కూతురూ—కూతురికి పెళ్ళయిపోయింది — అల్లుడు లెక్చరర్— కొడుకు ఎగ్రికల్చరల్ బియస్‌సి పాసయ్యాడు — ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేక వాళ్ల నాన్నచేత నాలుగెకరాల పొలం కొనిపించి, ఏవేవో క్రొత్త పద్ధతులతో స్వంత వ్యవసాయం సాగిస్తున్నాడు — ఉద్యోగం కంటే ఇదే బాగుంది—ఈరోజుల్లో డబ్బే తప్ప వస్తువు లెక్కడ కనిపిస్తున్నాయి?' దీర్ఘంగా నిట్టూర్చింది పార్వతి—

'అదృష్టవంతురాలివి కళ్యాణీ! — నా సంగతి చూడు—పెద్దవాడు ఆగమ్మ కాకిలా తయారయ్యాడు — ముగ్గురాడపిల్లల పెళ్ళిళ్ళు చేసాం— ఇంకా పుట్టింటివారు అదీ, ఇదీ పెట్టలేదని అమ్మాయిలను




అత్తగారు సాధిస్తోనే ఉన్నారుట — రెండో కొడుకు రోగంతో చచ్చిపోయాడు ఇంక అయిదో అమ్మాయుంది పెళ్ళికి — ఎలా చేస్తామో?'

'నాలుగో అమ్మాయి?'

'చచ్చిపోయింది—'

పార్వతి గొంతు వణికింది — దుఃఖంతో అనుకుని జాలిపడింది కళ్యాణి—

'దేనికైనా పెట్టిపుట్టాలి'— బాధగా అంది పార్వతి—

'అంతా చేతులారా జేసుకుని విధిని నిందించటం దేనికి పార్వతీ!'

'చేతులారా చేసుకున్నదా?' ఆశ్చర్యంగా అంది పార్వతి—

'ఒక రకంగా అంతే! ఏడాది కొకరు చొప్పున పిల్లల్ని కనేదానివి — నీ ఆరోగ్యమూ దెబ్బతింది— చికాకులూ ఎక్కువయి పోయాయి— మీ వారిని కాస్త కనిపెట్టి ఉండే అవకాశం లేకపోయింది — ఆయన వ్యసనాలకు బానిస అయిపోయారు— ఇటు నువ్వు లేనిపోని దర్జాలకు పోయి ఉన్నదంతా ఊడ్చేసావు నేను చూడు—మూడు వేలు బేంక్‌లో పడదే రామచంద్రను కనలేదు—రామచంద్రను కన్న మూడేళ్ళకి కాని సుశీలని కనలేదు— లేనిపోని బడాయిలకి నేను పోలేదు—నా పిల్లల్ని పోనియ్యలేదు—నేనే స్వయంగా వాళ్ళ చదువు సంధ్యలు చూసుకున్నాను— వాళ్ళ పైకొచ్చారు— ఇదంతా స్వయంకృతం కాకపోతే ఏవిటి?'

దీర్ఘంగా నిట్టూర్చింది పార్వతి—

'గంపెడు మంది పిల్లల్ని కనీ సుఖంగా ఉన్న వాళ్ళు లేరా? నా కర్మ మిలా కాలింది—'

'పిల్లలున్న వాళ్ళంతా ఇలా అయిపోతున్నారని కాదు — ఈ అవస్థకు ఇంత మంది పిల్లలు కూడా ఒక కారణమని చెప్తాను—నీ ఆరోగ్యం పాడవుతున్నపుడయినా జాగ్రత్త పడవలసింది—'

'నిజమే! ఆ ఆలోచన లేకపోయింది — చెప్పేవాళ్ళా లేక పోయారు—'

'అమ్మా! అంటూ వచ్చిన లత కొత్తావిడను చూసి ఆగిపోయింది—

'నమస్కారం చెయ్యి—' అంది పార్వతి— లత నమస్కారం చేసింది—...

'శ్రీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు—' అని దీవించింది కల్యాణి—

లత సిగ్గుపడి లోపలికి వెళ్ళిపోయింది—

'లధే! ఇప్పుడు పెద్ద బెంగ పోయింది—' దిగులుగా అంది పార్వతి—

'కల్యాణీ! నీ ఎరికలో ఏదయినా రెండో సంబంధం కట్నం లేకుండా చేసుకునే వాడుంటే చూసిపెట్టదూ! మరీ ముసలివాడు కాకుండా చూడు— అన్న వస్త్రాలకి లోపం లేకుండా ఉంచే చాలు— గొప్పవాడు కానక్కర్లేదు—'

కల్యాణి గుండెల్ని ఎవరో పిండినట్లయింది— కన్నతల్లే తన కూతురికి రెండో పెళ్ళివాణ్ణి చూడమని అడుగుతోంది— మొదటి సంబంధం పెళ్ళికొడుకులు కట్నం అడగక మానరని, కట్నం అడిగితే తామిచ్చుకోలేమని రూఢిగా అనుభవాలు నేర్పేసాయి గనుక—

'అలాగే చూస్తాను— లతకేం బంగారు బొమ్మ— మంచి సంబంధమే వస్తుంది'

'ఏమిటి బంగారు బొమ్మో కాని ఒంటి మీద బంగారం లేదుగద కల్యాణీ! అందుకే ఏ సంబంధమూ కుదరటం లేదు—'

'కుదురుతుందిలే పార్వతీ! అనవసరంగా కృంగిపోకు—'

'కొత్తగా కృంగిపోవడమేమిటే! పూర్తిగా చితికిపోయాను— జీవచ్ఛవాన్ని—'

కల్యాణి కళ్ళలో నీళ్ళు చిమ్మాయి—

'నే నిక వస్తాను—' అంటూ లేవబోయింది—

'ఉండు— కాస్త కాఫీ తీసుకు వెళ్ళుదువు గాని— లతా! కాస్త కాఫీ తయారు చెయ్యమ్మా! ఒక కప్పు—!'

'ఇప్పుడేం వద్దులే! పార్వతీ!'

'అలా అనకు— అప్పు ఇయ్యగలిగిన శక్తి ఉన్ననాడు నీకు ఏం ఇయ్యకుండా పంపించాను— దేవతలా అన్నీ మరచిపోయి, అభిమానంతో చూడటానికి వచ్చావు— ఈ పిల్ల కాఫీ బాధ నీకు తప్పదు.'

'ఛ! పిల్ల కాఫీ అనికాదు— సరేలే! కాఫీ వదులుకునే దెవరు ?' వాతావరణంలోని బరువు దించడానికి హాస్యంగా నవ్వేసింది—

(ఇంకా ఉంది)

# రంగుల రాట్నం




# చిరుత

చిరుతని లెపర్డ్ అని, పాంథరు అనీ అంటారు. ఆఫ్రికా నుండి, ఆసియా వరకు వ్యాపించిన ఘోరమైన పిల్లి ఇది. సిలన్‌లో కూడా ఇది కనిపిస్తుంది. చిన్నసైజు పులిలా ఉన్నా, శరీరం మీద గీరలు బదులు చుక్కలుంటాయి. పిల్లి పాదం గుర్తుల్లాకాని, సున్నలుగా గాని ఉంటాయి. శరీరం రంగు, స్ఫుటమైన పసుపుకాని, తెలుపు కాని, నలుపు కానీ ఉండవచ్చు. అయితే నలుపు ప్రత్యేకం ఒక తెగకు చెందదు. అప్పుడప్పుడు వ్యక్తిగతంగా కొన్నిటికి ఉంటుంది. అయినా ఆ నలుపులోనే, నల్ల మచ్చలు కనబడతాయి.

చిరుత నిజానికి సింహం, పులి కన్నా భయంకరమయింది. మనిషిని, పశువుల్ని చంపడానికి ఏ మాత్రం వెనుతియ్యదు. కుక్క అంటె మరీ ఇష్టం. దాని వల్ల మనకు కూడా ప్రమాదం సంభవిస్తుంది — మన కుక్కల మీదకు అదివస్తే. సింహం అన్నా సర్ది పెట్టుకుటుంది కాని, ఇది, అప్పుడే చంపిన జంతువులను తప్పిస్తే, ఏమాత్రం చెడిపోయిన శవాన్ని ముట్టదు.

ఉత్తర ఆసియా, మంచు ప్రాంతాల్లో 'మంచు చిరుత'కు తెల్లని రంగు మీద, దూర దూరంగా మచ్చలుంటాయి. అడవుల్లో చిరుతలు చెట్లు సునాయాసంగా ఎక్కేస్తవి. అందువల్ల కోతులకు ఇదంటే ప్రళయ స్వప్నం. చెట్ల మీదకాని, నేల మీదకాని తిరిగే ఎన్నో జంతువులకు ఇది భయంకరమయింది. చంపేప్పుడు సాధారణంగా మెడ విరిచి ప్రాణం తీస్తుంది. ఇండియాలో చిరుతని, ప్యాంథరు అని అంటారు. — జమ్మి కోనేటిరావు.




యోగులెప్పుడూ కష్ట సుఖాలనూ, సుఖదుఃఖాలనూ సమానంగానే చూస్తారు. అపకారినీ, ఉపకారినీ కూడా అభిన్నులనియే తలుస్తారు అట్టి అభేద బుద్ధే తరు ణోపాయమై ఉంటుంది, వారికి

ఒకానొక గ్రామంలో ఒక మఠం వున్నది. అందులో కొందరు సన్యాసులు నివసిస్తూ వుంటారు వారు తమకు క్షుద్బాధ వున్నప్పుడు ఊళ్ళో తిరిగి, ఎవరైనా యేమైనా యిస్తే తింటూ కాలం గడుపుతారు. అంతేకాని తిండికి యెక్కువగా ప్రాధేయపడరు. ప్రజలలో చాలామందికి ఆ సన్యాసులపైని భక్తి గౌరవాలుండేవి

ఒకనాడు బిచ్చగాడొకడు ఒక ధనికుని యింటి ద్వారం దగ్గర నిలబడి బిచ్చం కోసం గట్టిగా అరవసాగాడు మొదట ఒక పనిమనిషి వచ్చి 'బిచ్చంలేదు పొమ్మ'ని చెప్పింది. వాడు కదలక మళ్లీ అరచాడు, యజమాని కుమార్తె పదేళ్ల అమ్మాయి వచ్చి 'బిచ్చంలేదు. పో' అని కసిరింది. ఇలా అనడం, తర్వాత పెద్దవాళ్ళు వచ్చి బిచ్చం వెయ్యడం చాలాచోట్ల పరిపాటే! అందువల్లనే ఆ బిచ్చగాడు కదలకుండా అక్కడే నిలబడి అరిచాడు. అప్పుడు గృహ యజమాని అయిన ధనవంతుడు కోపంతో ఒక కర్ర పట్టుకొని వచ్చి ఆ బిచ్చగాడిని చావగొట్టాడు

అలా కొడుతూ వున్నప్పుడు మఠంలో నివసించే సన్యాసి ఒకడు ఆదారంట పోతూ యీ సంఘటనను చూశాడు అతనికి బిచ్చగాడిమీద జాలి కలిగింది 'అయ్యా! నిష్కారణంగా—దయా దాక్షిణ్యాలు లేక ఆ భిక్షుకుడిని ఎందుకు కొడతారు? మీ కిష్టం వుంటే బిచ్చం వెయ్యండి, లేకపోతే వూరుకోండి వాడే వెళ్ళిపోతాడు' అని ఆ ధనవంతుడితో అన్నాడు.

ఆ సన్యాసి తన్ను అవమానిస్తున్నట్లు ధనవంతుడికి తోచింది అతడు కోపం పట్టలేక 'ఓ బోడిసన్యాసీ! నువ్వా నాకు బుద్ధి చెప్పేవాడివేనా? వాడు చిన్న బిచ్చగాడు; నీవు పెద్ద బిచ్చగాడవు, జాత్యభిమానం యెక్కడికి పోతుంది? ఇదిగో! నీకు తగినట్లు బుద్ధి చెప్తాను చూడు' అని, బిచ్చగాడిని విడిచి సన్యాసిని చావగొట్టసాగాడు, సన్యాసి, కదలకుండా నిలబడిపోయి వుండడం వల్ల కసితీరా కొట్టి అతడు తెలివి తప్పి పడిపోయిన తర్వాత ధనవంతుడు ఇంట్లోకి పోయి తలుపులు మూసుకొన్నాడు అంతేకాని, సన్యాసికి తెలివి తెప్పించడానికయినా యత్నించలేదు

ఆ దారిని పోతూవున్న జనం ఆసన్యాసిని చూచి మోసికొని పోయి మఠంలో చేర్చారు. అక్కడున్న సన్యాసులు ఇతనికి తెలివి తెప్పించడానికి చికిత్సలు చేశారు అయినా, అతనికి తెలివి రావడానికి ఎంతో కాలం పట్టింది. ఒక సోదర సన్యాసి వేడి వేడిపాలు తెచ్చి నోటిలో కొంచెం కొంచెం పొయ్యగా, నాలుగయిదు గుటకలు వేసి కన్నులు తెరిచాడు.

అప్పుడు సోదర సన్యాసి 'మీకు తెలివి వచ్చినదా? నేనెవరో గుర్తించగలరా?' అన్నాడు.

అప్పుడా క్షతగాత్రుడు 'గుర్తించ లేకేమి? బాగా గుర్తు వస్తున్నారు కొంత సమయానికి ముందు దయాదాక్షిణ్యాలు లేక నన్ను నిష్కారణంగా చావగొట్టారు మీరు; ఇప్పుడు అభిమానంతో ఎంతో శ్రమపడి తెలివి తెప్పిస్తున్నారు.' అని అన్నాడు

ఆ మాటలు విని అక్కడ చేరిన జనం ఆశ్చర్య పోయారు. లోకంలోని సర్వ ప్రాణులనూ — ఉపకారులూ అపకారులూ అనే భేదం లేకుండా సమానంగా చూస్తూ వున్న ఆ యోగి—ధనవంతుడినీ, సోదర సన్యాసినీ అభిన్నులుగా తలచడంలో వింత యేమీ లేదు. ●



# గుండెల మీది కుంపటి




సెలయేటిలో నీటిని దోసిలితో తీసి త్రాగి జోగయ్య వేరేడు చెట్టు ప్రక్కనున్న ఇసుకతిప్పలమీద కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు. పిల్లగాయిలు పెట్టే గిలిగింతలకు పైరు మొక్కలు నృత్యం చేస్తున్నాయి. ఆవులూ, గేదెలూ, లేగ దూడలూ తృప్తిగా నీరు త్రాగి ఉల్లాసంగా ముందుకు సాగిపోతున్నాయి జంట జంటలుగా పక్షులు ఓ చెట్టునుంచి మరో చెట్టుకు ఎగురుతున్నాయి పుస్తకం పరాగంగా చదువుకుంటున్న జోగియ్యకు పశువులమీద కూర్చుని మనోహరంగా పాడుకుంటున్న చిన్న పిల్లలు కనుపించారు చిన్నప్పుడు వీళ్ళూ వాళ్ళూ చెప్పగా విన్న మాటలు గుర్తుకు వచ్చాయి యమధర్మరాజు ఎవరైనా చనిపోతే అలావే గేదెమీద వచ్చి కంఠానికి పాశంవేసి ప్రాణము లాక్కుపోతాడని జోగయ్యకు గుర్తుకు వచ్చింది రాకపోనుగాని తల్లికి జబ్బుగా ఉంది ఎప్పుడో ఒకప్పుడు ఆ దీపం ఆరిపోయే పరిస్థితిలో వుంది తల్లిపోతే ఆ గ్రామానికే తనకూ ఋణం తీరిపోతుంది. ఏవేవో తలపులు జోగయ్యకు వస్తున్నాయి.

ఇంతలో వెనుకనున్న పడిగాటలోనుంచి కుర్రాళ్ళు తన వైపు పరుగెత్తుకుంటూ రావటం చూశాడు వాళ్ల చేతులనిండా జీడిపళ్ళున్నాయి. తోటమాలి ఎదురుకు

ఒక విషయం చెప్తాను. అలా అని నిన్ను నేను తొందరగా పొమ్మని వెళ్ళించుకుందామని కాదు. మీ అమ్మ అప్పుడప్పుడు తన మనసులోని కోర్కెను చెపుతుండేది తాను చనిపోయేక నిన్ను పట్నంలోవున్న మీ అన్నకు మెల్లగా అప్పచెప్పమని నాతో వస్తావా జోగయ్యా?' అన్నాడు

వస్తా నన్నట్టు జోగయ్య తలూపాడు. మూటా ముల్లె సర్దుకున్నాడు గ్రామ పెద్దల దయవలన తల దాచుకోటానికిచ్చిన పూరిపాకను కడసారి చూశాడు పచ్చని చెట్లన్నీ మంచులో తడిసి ఏడుస్తున్నట్టు న్నాయి చదువుకున్న ఇసుకదిబ్బ దాహా నికి పుడిసెడు నీళ్ళు దోసిళ్ళతో త్రాగ టానికిచ్చిన పిల్ల కాలువ. ఒక్కొక్కటీ దాటి ముందుకు పోతున్నాడు ఎవరితోనూ పోతున్నానని చెప్పలేదు నాయుడు బాబు వెనుకను మంత్రించిన వాడిలా పట్నం పోతున్నాడు.

'ఇన్నాళ్ళు యీ ఊరిలో పెరిగాడు. ఒక్క మాటన్నాడు కాదు' అని జోగయ్య స్నేహితులు అనుకున్నారు కాని వాడి తత్వమే అంత అన్న సమాధానము వాళ్ళకు వాళ్ళు చెప్పుకున్నారు నాయుడు బాబు జోగయ్య పట్నం చేరి రామానుజయ్య ఇంటికి పోయారు నాయుడు బాబు వరండాలో నిల్చున్నాడు ఆతని ప్రక్కనే చేతి సంచితో జోగయ్య నిల్చున్నాడు. పట్నంలో వున్న తన అన్నయ్యను ఆనాటికి చూసిన జోగయ్య మనసులో సంతోషించాడు. అన్నయ్య పిల్లలు ఎవరో క్రొత్తవాళ్ళు వచ్చారని కిటికీలోనుంచి చూస్తున్నారు

'అదుగో! ఆవిడే మీ వదినగారు కిటికీ ఊచలు పట్టుకుని చూస్తున్నవాళ్ళు మీ అన్నయ్య పిల్లలు మీ అన్నయ్య ఇంటికి వచ్చేవేళయింది మీ అన్నయ్య తర్వాతది మీ అక్క. పాపం! పెళ్ళి కాలేదు.. మాష్టరమ్మ ట్రెయినింగు అవు తోంది...తాను కూడ ఇంట్లో లేనట్టుంది'

నాయుడుబాబు చెపుతుంటే జోగయ్య తృప్తిగా విన్నాడు. అమ్మ పోయినా తన వాళ్ళున్నారని ఆనందించాడు

'ఇదుగో బుల్లిబాబూ! ఈయన నెవరో తెల్సా?'

పిల్లలు ఒకరి ముఖాలు ఒకరు చూసు కున్నారు.

'మీ చిన్నాన్న!'

'మా చిన్నాన్నా?!'

'ఆc—ఇన్నాళ్ళూ పల్లెటూర్లో వుండి పోయాడు ఇప్పుడిక్కడ వుండిపోవటాని కొచ్చాడు'

'అరే తమ్ముడూ! పైకి వెళ్ళి చిన్నాన్న దగ్గర కూర్చుందాము రా! మూటలో పప్పు లవీ వుంటాయి ఇస్తాడు'

నాయుడుబాబు చిన్నగా నవ్వుకుని త్రోవలో పిల్లలకని కొన్న బిస్కట్లు బిళ్ళలు తీసి పైకి పిలిచియిచ్చాడు పిల్లలు సంతోషంగా తింటున్నారు జోగయ్య వదిన కమలమ్మ వీళ్ళ రాకవలన లోపల్లోపల మండిపోతూ కాలు కాలిన పిల్లిలా తిరుగు తోంది

'అప్పుడప్పుడు కాళ్ళబేరానికి వచ్చిన నాయుడుబాబు అన్నంత పనీ చేశాడు. ఆ గుంట వెధవని ఇంట్లో అంటకట్ట టానికి తీసుకువచ్చాడు.' అని మూలు క్కుంటూ చేతికి దొరికినవాటిని విసిరి కొడుతోంది అప్పుడే రామానుజయ్య ఆఫీసునుంచివచ్చాడు వస్తూనే జోగయ్య వాళ్ళను చూశాడు గుమ్మంలో జోగయ్య ముఖములో అమాయకత్వముంది. బలి చక్రవర్తిని మూడడుగుల స్థలం అడగ టానికి వచ్చిన వామనమూర్తిలా వున్నాడు

'ఏదే రావటమా నాయుడుబాబూ!' పలుకరించాడు రామానుజయ్య.

'అవును బాబూ! లక్ష్మమ్మ కన్ను మూసేంద తానున్నాళ్ళూ చెప్పింది నేను మీతో అప్పుడప్పుడు పట్నం వస్తు న్నప్పుడు చెప్పింది ఇదే! ఈ భారాన్ని మీమీద వెయ్యాలనికాదు నాకు భూము లున్నాయి పాడిపంట వుంది నే చూసుకో గలను కాని లక్ష్మమ్మ ఒట్టు పెట్టు కుంది జోగయ్యను దిక్కుమాలిన వాడిలా విడిచిపెట్టకుండా నా అన్నవాళ్ళ దగ్గర కష్టమో నష్టమో పడెయ్యమంది... అందుకనే వచ్చాను'

రామానుజయ్య ఏమీ అనలేదు. అలా మెల్లగా బల్లమీద కూర్చుండిపోయాడు. నాయుడుబాబు మళ్ళీ చెప్పాడు

'జోగయ్య తత్వం నాకు తెలుసును ప్రపంచముతో సంబంధములేని వాడిలా వుంటాడు మీ రేమైనా పెడితే తింటాడు. లేదంటే అలానే కూర్చుంటాడు. . రామానుజయ్యా! నీ బాధ నాకు తెలుసును. ఇవి చేతులు కావు. కాళ్ళు. లక్ష్మమ్మ చనిపోయే ముందు అప్పచెప్పిన పనిని యీనాడు నేను చేసుకుపోతున్నాను'

నాయుడుబాబు లేచి నిల్చున్నాడు 'జోగయ్యా! నే వెళ్తాను నాయనా!' అన్నాడు జోగయ్య కండ్లలో కృతజ్ఞత చూపించాడు. అప్పుడప్పుడు కనుపిస్తుండు నాయుడుబాబూ! అన్న మాటలు పెదవుల మీద సూచాయగా కదలినట్టయాయి... నాయుడుబాబు పోతున్నాడు . ..

ఎటూ చెప్పలేక రామానుజయ్య



## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేననీ, దేనికీ అనుకరణ కాదని హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీ లేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# గుండెలమీది కుంపటి

మెల్లగా లోనికి తప్పుకున్నాడు. భార్య ముఖం మహా భయంకరంగా వుంది ఏమన్నా కస్సు మంటుంది పిల్లలు ఆ వాతావరణానికి భయపడి పుస్తకాలు మనసులోనే చదువుకుంటున్నారు వసారాలో కూర్చుని ఒక్కొక్కటే ఆలోచిస్తున్నాడు.

డిస్ట్రిక్టుబోర్డు హెడ్‌క్లార్కుగా చేస్తున్న తండ్రి దశరథ రామయ్యకు తానూ చెల్లెలు జానకీ మాత్రమే సంతానము జానకిని కన్న తర్వాత మశూచి వ్యాధితో తల్లి చనిపోయింది. జానకి ముఖం కూడ మశూచి వలన అంద వికారంగా తయారైంది... నాన్న మరి పెళ్ళి చేసుకోలేదు. కాని మనిషికో బుద్ధి. ఎవరి ఖర్మలో ఏముందో! పనిచేసుకుంటున్న వంటలమ్మతో సంబంధం పెట్టుకు తిరగటం మొదలు పెట్టాడు ఇదిచూసి తననూ జానకినీ తాతగారు కోపంతో ఊరుతీసుకుపోయారు పెంచటానికి.. లక్ష్మమ్మకు జోగయ్య పుట్టాడు. జోగయ్య పితృగండాన పుట్టటంచేత తండ్రి కొన్నాళ్ళకే కన్నుమూశారు ఒక్కొక్కటే గుర్తుకొస్తున్నాయి

ఆరిపోతున్న పొయ్యిని గట్టిగా వూది కమలమ్మ మెల్లగా వచ్చి 'రోజూలా కాకుండా ఆలోచనలో పడ్డారే!' అంది. రామానుజయ్య ఏమీ అనలేదు.

'నాకు తెలుసును. నాయుడు బాబు వచ్చినవాడిని వచ్చినట్టే సాగనంపాననీ ఏం మర్యాద చేయలేదనీ... మీ తమ్ముణ్ణి పిలిచి పలుకరించలేదనీ.. అంతేనా?'

'ప్రతీదానికి విపరీతార్థం తీస్తావు కమలా నే పడేబాధ నీకు తెలియదంటావా?

మీరుపడుతున్నబాధ నాకెందుకు తెలీదూ నాన్నగారు చేసిన ఘనకార్యం! తలంచుకుని కుమిలిపోతున్నారు.'

'పుండుమీద కారంజల్లే స్వభావం కమలా నీది'

'అదయితే బాగుండేది. కారం తగిలేక కాసేపు మండినా తర్వాత మాడుకట్టి పుండు మానుతుంది ఈమాటల్ని గోరుచుట్టుమీద రోకటి పోటంటారు.'

రామానుజయ్య ఏమీ అనలేకపోయాడు కమలమ్మ కఠినమైన మాటలకు కలత చెందాడు. మళ్ళీ అందుకుంది.

'చూడండి మనసులో కోపం వున్నప్పుడే నిర్మొహమాటంగా అన్నీ వెళ్ళగక్కాలి. తర్వాత ఎలాగా ఆవేదన మరిపుట్టదు. వీరా నాన్న రక్తమే! కాదనటములేదు. కాని ఇంట్లో కలిసిమెలిసి తిరగనిస్తే కొంచ గౌరవం కాస్తా కారిపోతుంది. కొన్నాళ్ళ తర్వాత మన పిల్లలకు రావలసిన సంబంధాలు ఒప్పుడు వీడివాణ్ణి వెనుకవేసుకు వస్తారు బంధువులు. ఆ అరుగుమీదే అలా పడుండనీయండి కొద్దిరోజుల్లో ఎక్కడో ఏదో పనిచూసుకు పోతాడు ... ఏం? దాచిపెట్టాడా ఇక్కడే వున్నన్నాళ్ళా గడపటానికి?'

రామానుజయ్య ఏమీ అనలేదు

'ఇరుగూ పొరుగూ ఎవరయ్యా ఇతడని అడుగుతారు మీ వూరివాడే అని చెప్పండి. పాపం గతిలేక ఇక్కడికి వచ్చి ఏదైనా పుదోగ ప్రయత్నంలో వున్నాడనండి. అంతేగాని పాత పుణ్యం పేరం అన్న చెప్పకండి, దానివల్ల మంచి కన్నా చెడు ఎక్కువుంది'

రామానుజయ్య కన్నులు బాధతో కప్పివేయబడ్డాయి ఎటూ చెప్పలేని పరిస్థితిలో [illegible] చెప్పి వెళ్ళిపోయాడు. కాసేపట్లో జానకి వచ్చింది మసక మసక చీకట్లో జోగయ్య అస్పష్టంగా కనుపించాడు ఎవరో ఏమో అనుకుని లోపలికి వెళ్ళి పుస్తకాలవీ పెట్టింది

'చంటీ! ఇలారా!' అని అప్పయ్య కొడుకుని పిలిచింది.

'ఏమత్తయ్యా?' అనుకుంటూ వచ్చాడు చంటివాడు

'ఆ పైన అరుగుమీద వున్న దెవర్రా?'

'నాకు తెలీదత్తయ్యా!'

వెంటనే కమలమ్మ అందుకుంది.

'గుండెలమీది కుంపటంటే అర్థం తెలుసునమ్మా జానకమ్మా నీకు?'

జానకి ఏమీ అనలేదు ప్రేళ్ళు నులుముకుంటూ వదినవైపు ఆదోలా చూసింది.

'నీ విషయం చూడు! పెళ్ళి పెడాకుల్లేకుండా వికృతమైన ముఖంతో ఇన్నాళ్ళ ఇంట్లో వుండిపోయావు ఎప్పుడు నీనుంచి ఏ చెడ్డపేరు వస్తుందో అన్న భయం నాకూ మీ అన్నయ్యకూ. ఒకవేళ చెడ్డపేరు వస్తే అది నీతోనే అంతరించిపోదు.

మామీదవిరుచుకుపడుతుంది. అందుకనే ఆడపిల్ల గుండెలమీది కుంపటంటారు. నీవు మొదటి కుంపటివి. అప్పైనున్నది రెండో కుంపటి. నాన్నగారు ఆస్తిపాస్తులు సంపాదించకపోయినా ఈ ఘనకార్యంచేసి మరీ పోయారు'

జానకికంతా అర్థమైంది. తల్లీ తండ్రీ గుర్తుకొచ్చారు. బాధతో బరువెక్కింది హృదయము. వదిన మాటలు మరీ బాధ పెడుతున్నాయి. బాధగా వుండని పారిపోలేదు. ఎక్కడికి పారిపోతుంది? చిత్రవధ యనుయాతన ల్యాదుబు పడుతూ అన్నయ్య గృహంలో తలదాచుకోవాలి. కారణం తానాడని. వదిన కూడ ఆడదే! తనకూడ చదువు సంస్కారమున్నాయి. కాని ఎవరి భర్త రాబడి వారిది. అందులో నెలనెలకూ మిగలాలి. వంటలు వేలవాలి. భవిష్యత్తులో పిల్లల చదువులకు పెళ్ళిళ్ళకు డబ్బు పనికి వస్తుంది. అల్లాంటి ఆలోచనలతో వున్న వారికి జానకి జోగయ్యల్లాంటి వాళ్ళు చాల రోతగా కనిపిస్తారు. అభివృద్ధి నిరోధకులని పిస్తారు......

పైని లైటు వెలిగించి పెడుతూ జోగయ్య ఎట్లా వుంటాడో అని ఓరగా చూసింది. వచ్చినాడు వచ్చినట్టే వున్నాడు. ఎవరూ నాడిలో ఏనాట్లాడిసట్టు లేదనుకుని గ్లాసుతో మంచినీళ్లిచ్చింది. గొంతుక ఆర్చుకు పోయివుందేమో జోగయ్య తృప్తిగా త్రాగాడు. అప్పుడే వచ్చిన రామానుజయ్య జోగయ్యకు ఏమైనా పెట్టమన్నట్టు జానకికి మెల్లగా చెప్పాడు. జానకి జోగయ్యకు అన్నం పెట్టింది. గిన్నెలు కడిగింది. ఆ అరుగు మీదే పక్కవేసింది. మర్నాటి నుండీ స్నానమదీ ఎక్కడ చెయ్యాలో కాలకృత్యాలవి ఎక్కడ తీర్చుకోవాలో చెప్పింది...

నిద్రపోయే ముందు కమలమ్మ తలుపులు వేస్తూ 'జానకీ! ఇలారా' అంది, చదువుకుంటున్న జానకి 'ఏం వదినా!' అంటూ వచ్చింది.

'అన్ని వస్తువులూ జాగ్రతగా. వుంచుకో— వే వేరే చెప్పాలటమ్మా!... ఈ జాతి ఎలాంటిదో తెలుసా? తిన్న వ్వాళ్ళు తినటము...తిన్న ఇంటికి వాసాల్లెక్కపెట్టటము. పక్కింటి రాజుల కుర్రాడు చేసిన ఘనకార్యం విన్నావుగా! వాళ్ళన్నయ్య ఏదో నాలుగునెలలపాటు ఆదరించాడో లేదో పందెంపోతులా తయారై కళ్ళు నెత్తికెక్కాయి...కుక్కకు విశ్వాసముంటుందమ్మా! ఈ జాతికి మాత్రం విశ్వాసముండదు. చేతి వాచీ పెన్ బట్టలే ఎత్తుకు పారిపోయాడు...నాకు తెలి కడుగుతాను అవన్నీఅమ్ముకుంటే .పట్టుమని పదిరోజుల గ్రాసం—కాని పరువుపోతుంది. పరపతి పోతుంది. మళ్ళీ రమ్మంటే వస్తాయా? రావు—చచ్చినా రావు. మచ్చ మచ్చలావే వుండిపోతుంది.'

జానకి మౌనంగా చూస్తోంది.

'పట్టుకు పోయినవాళ్ళు పట్టుకు పోతారు. చెడ్డపేరు తక్కిన వాళ్ళకు మిగులుతుంది...ఫలానా వాళ్ళ అబ్బాయి... ఫలానా వాళ్ళ తమ్ముడు...ఇట్లాంటి పేర్లు మిగిలి పోతాయి'

జానకి ఏమీ అనలేదు. మౌనంగా గది లోనికి వెళ్ళిపోయింది. జోగయ్యకు తోటమాలి కోటయ్య తోటలో కొద్దిరోజుల క్రితం కొట్టిన లెంపకాయలు గుర్తుకొచ్చాయి. విధి చేతిలో కీలుబొమ్మ. నోరున్నవారు నాలుగు అబద్ధాలుచెప్పి నేరం తప్పించుకోగలరు. నోరులేని దురదృష్ట జంతువులు అమ్మవారి జాతరలో బలికోసరం వెళ్ళే మూగమేకల్లా సంఘానికి దొరికి పోతారు. ఆ చిన్నిహృదయము ఏవేవో భావనలు బాధలు గడచిన రోజులు భవిష్యత్తులో అవాంతరాలు తలపోస్తోంది. దిక్కులేనివారు డబ్బులేనివారు ప్రపంచానికి ప్రతిబంధకము. అన్నయ్య కుటుంబానికి తాను ప్రతిబంధకముగా వున్నాడు. పిడికెడు గింజలు మిగిలితే ఎందుకైనా పనికివస్తా యనుకునే కరువు రోజులు. గుండెలమీది కుంపటిలా ఎందుకుండాలి?......నిద్ర పట్టదు—శరీరమంతా చీమలు ప్రాకుతున్నట్టున్నాయి. పట్టీ పట్టని నిద్రతో ఆవులింతలు తీస్తున్నాడు. జానకి మెల్లగా లేచివెళ్ళింది. జోగయ్య ఇంకా నిద్ర పోలేదు. జానకిని చూసి గోడవైపు తిరిగి పోయాడు.

'ఏవో తలుచుకుని బాధపడకు తమ్ముడూ! వదిన ఎప్పుడూ అంతే!' మనల్ని కాదనుకోవాలి. కాదనుకుంటే ఇలా గడిపెయ్యగలము. లేదా ఒక్క క్షణం గడప లేము. ప్రపంచంలో గడపాలంటే మొండికెత్తాలి. గుండెను రాయిచేసుకోవాలి' మెల్లగా చెవిదగ్గర చెప్పి నిద్రపోయేందుకు తన గదికి పోయింది.

మందంగా రోజులు గడుస్తున్నాయి. చాలీచాలని తిండితో జోగయ్య కొద్దిగా చిక్కిపోయాడు పగలంతా ఏ అరుగుమీదో ఏ చెట్టునీడనో గడిపేవాడు. భోజన సమయానికి ఇల్లుచేరుకునేవాడు. ఒక రోజు మధ్యాహ్నం ఎండ విపరీతంగా వుంది. తలనొప్పిగావుంది జోగయ్యకు. తూలుతూ ఇంటికివెళ్ళి అరుగుమీద పడుకున్నాడు. కమలమ్మ కరుకుమాటలు కిటికీలోంచి శూలాల్లావచ్చి గుచ్చుకున్నాయి.

'ఉద్యోగస్థుడొచ్చాడు ఉద్యోగస్థుడు... మూడు పూటలూ మస్తుగా తిండి. మరే పనీలేదు. కిరాణాకొట్లో కావలసినంత పద్దు రాసైపోతోంది. ఈయనగారికి చూస్తే దగ్గు జ్వరము—కొన్నాళ్ళదో గానికి కొన్నాళ్ళింటిదగ్గర...భగవంతుడా! నాతలరాత ఇలా రాశావేమిరా?'అని నెత్తీ నోరూ కొట్టుకుంటోంది. నిరాదరణతో జోగయ్యను వొదిలించుకుందామని చూస్తోంది. గంజిలో పిడికెడు మెతుకులు వేసి గిన్నెను వంటవాడితో పంపింది అరుగుమీద పెట్టెయ్యమని. ఉప్పు కూడ వెయ్యటం మరచింది కోపంలో. ఇంతలో ఎక్కడినుంచి వచ్చారో నాయుడుబాబుగారబ్బాయి గోపాలం మరోఇద్దరు కుర్రాళ్ళు జోగయ్య ఇల్లు వెతుక్కుంటూ వచ్చారు.

'జోగయ్యా! పొద్దుట తొమ్మిది గంటలకు వచ్చినవాళ్ళం ఇప్పటికి నిన్ను కనుక్కున్నామోయ్!'



# గుండెలమీది కుంపటి

బాధను సూచించే నవ్వు నవ్వాడు జోగయ్య గిన్నెలోని గంజితో ఈగలు ముష్టియుద్ధం చేస్తున్నాయి. జోగయ్య బ్రతుకు తృటికాలంలో అర్థమైపోయింది వాళ్ళకు.

'జోగయ్యా! అలా పోయివద్దాంరా!' అని జోగయ్యను హోటల్‌కు తీసుకువెళ్ళారు. నలుగురూ భోజనం చేశారు

'ఈ మూడు నెలలకూ ఇదే మంచి భోజన మనుకుంటాను..... . అవునా?' గోపాలం అడిగాడు.

'పిచ్చిలాంటివేమీ అడగకురా నాయనా! . ఇంతకూ మనం వచ్చిన విషయం ఆలోచించండి' అన్నాడు మరో అబ్బాయి.

'జోగయ్యా! రేపు మ న లాం టి కుర్రాళ్ళను మిలిటరీకి తీసుకుంటారట! పేపర్లో వేశారు మన ఊరి హవల్దార్ అప్పలస్వామి యీవూరి రిక్రూటింగు ఆఫీసులో వున్నాడు. మనల్ని తప్పక తీసుకుంటారు పెద్ద పెద్ద పట్నాలను చూడవచ్చు, సినిమా వాళ్ళను చూడవచ్చు, స్టుడియోల్లో షూటింగులుచూడవచ్చు— మాతో నువ్వుకూడ రా!'

జోగయ్య ఏమీ అనలేదు

'కుక్కకన్న హీనంగా చూస్తున్నారు మీ వాళ్ళు నిన్ను కుక్కకు పోసిన గంజైనా నయం కాస్త బాగుంటుంది మాతో వచ్చేక మంచి వెద్దామేం మాను కుంటావు'

జోగయ్య ఏమీ అనలేదు ... త్రోవలో రాత్రికి తినవలసినవి కొనుక్కున్నారు లక్కడక్కడ గడిపి రాత్రి ఎనిమిది గంటకు ఇల్లు చేరుకున్నారు. జానకి ఏరండాకు అనుకుని వున్నగదిలో చదువుకుంటోంది. వాళ్ళ సామాన్లవీ అరుగు మీద పెట్టుకున్నారు. జానకి గుండెలో బెంగ పట్టుకుంది జోగయ్యను చూడటమే వదినకు బ్రహ్మాండమైపోతోంది, వానరమూకలా వెనుకనే మరో ముగ్గురు వచ్చారు. వీధి తలుపులన్నీ కమలమ్మ దడ దడ శబ్దం చేస్తూ మూసింది, జానకి మెల్లగా పైకి వచ్చింది.

'చూడండి—మాకేం అక్కర్లేదు తిండీ గట్రా మా దగ్గరున్నాయి. తిన్న తర్వాత గొంతుక వెగటానికి నీళ్ళుండాలంట. యీ ఇంట్లో అవైనా దొరుకుతాయా?'

జానకి ఆగమంది, వెనుతిరిగి వెళ్ళి పెద్ద లోటాతో నీళ్ళుతీసుకు వచ్చింది. వాళ్ళు తెచ్చుకున్నవి ఐదుభాగాలు చేశారు. నాలుగు భాగాలు వాళ్ళు తీసుకుని ఒక భాగం జానకి కీయబోయారు

'అబ్బాయిలూ! నే ఒకటి అడుగుతాను చెప్పండి 'ఇన్ని వస్తువులు ఖరీదైనవి కొన్నారు ఈ డబ్బు మీ కెక్కడిది? నిజం చెప్పండి!' అని లడిగింది

'మాకేముండీ! గరిసెలకొద్దీ ధాన్యం పండుతుంది. ఇంట్లో అడిగి తీసుకు వచ్చాము ఆ లెడ్డూలవీ తీసుకోండి'

'మీ మాటల్ని నమ్మలేక పోతున్నాను ఇది ఇలా వుంచుకుని తెల్లవారేక మీరే తినండి' అని జానకి తన గది లోనికి పోయింది ... నిద్రపోయేవాళ్ళు నిద్రపోక పాటలూ పద్యాలు కూనిరాగం తీయటం మొదలు పెట్టారు జోగయ్యకూ జానకికీ వింతగా వుంది భరించరాని కష్టంలో కమలమ్మ కిటికీ వద్దకు వచ్చింది.

'విశ్వాసంలేని వెధవలు చాటుమాటుగా ఉత్తరం రాసి గుంట వెధవల్ని నామీద యుద్ధానికి లొక్కువచ్చారు ఇన్నాళ్ళు చూసింది పోయింది దీనంతటికీ వెనుక నుండీ నాటక మాడిస్తున్న శక్తి వుండనే వుంది'

జానకి ఆత్రుతగా వెళ్ళి ఆ కుర్ర వాళ్ళను నాలుగు కేకలు వేసింది

'చూడు నాయనా! మీరేదో గొప్పగా వుంటుందనేమో గిల్లి కజ్జాలు తెస్తున్నారు తెల్లవారితే మీ ఇంటికి మీరు పోతారు మా బ్రతుకులు మాత్రం చెడగొట్టకండి బాబూ!'. . ...

మర్నాడు ప్రొద్దుట చంటి పిల్లలు జోగయ్యవాళ్ళు ఏం చేస్తున్నారో చూద్దామన్న కుతూహలం కొద్దీ లోపల్నుంచి కిటికీ ఊచలు పట్టుకుని చూస్తూ, 'చిన్నాన్నా!' అని పిలుస్తున్నారు గోపాలం వాళ్ళకు ఇడ్లీ పొట్లం ఇస్తుండటమూ కమలమ్మ కోపం కొద్దీ చంటివాళ్ళ వీపుమీద గట్టిగా కొట్టి క్రిందికి పడగొట్టటమూ ఒకేసారి జరిగిపోయాయి.

'పాపం! చంటి వాళ్ళను ఎందుకండమ్మా అట్లా కొడతారు. వాళ్ళు మాత్రం ఏం తప్పు చేశారు! చిన్నాన్నా అన్నారు అంతేగా?'

'చిన్నాన్నట! చిన్నాన్న నానాజాతి వెధవ లంత చిన్నాన్నలే— యీ వెధవ ఇంట్లో చేరిందగ్గర్నుండీ వచ్చే బంధువులు రావటం మానేశారు'

'బంధువులంటే మీ ఆయనగారి తరఫు వారు కాదన్నమాట!.. మీ అమ్మా నాన్నా ఇత్యాదులన్నమాట!'

'వాగుడు మానండిరా! దయితలచి ఓ రాత్రికి గమ్మంలో వుండనిచ్చాను'

'చూడండమ్మా! మేమూ జోగయ్య జాతీయ సైన్యంలో చేరిపోవటానికి పోతున్నాము నెత్తిని ఉక్కుటోపీ కాళ్ళకు బూట్లు మేజోళ్ళు నడుముకు బెల్టు దానినంటిపెట్టుకుని తుపాకి గుళ్ళు చేతిలో రైఫిల్ ఇదంతా ఎందుకో తెలుసునమ్మా! శత్రువుల్ని భయపెట్టటానికి . సమయమొస్తే దేశం కోసం రక్తాన్ని చిందించటానికి'

ఒర్ర నిండా మాటలే వెధవలకు — మిమ్మల్నని లాభమేముంది మీ చేత అని అనిపిస్తున్న వాడిననాలి'

'ఏమండోయ్! వెర్రిబాగులవాడు జోగయ్య వాణ్ణి మాత్రం మరేమీ అనవద్దు'

'కట్టకట్టుకు చావండిరా! నాకేం!' అనుకుంటూ కమలమ్మ కిటికీ మూసింది. లోన రామానుజయ్య దగ్గుతున్నాడు. బయలుదేరేముందు జోగయ్య అన్నయ్య నొక్కసారి దూరంనుంచైనా చూడాలని ఆశపడ్డాడు. కాని వదిన కిటికీ మూయటం వలన ఆ ఆశ నిరాశగామారింది జోగయ్యను వెంటబెట్టుకుని గోపాలం వాళ్ళూ రిక్రూటింగ్ ఆఫీసుకుపోయారు........

రోజులు గడుస్తున్నాయి. జోగయ్య తిరిగివచ్చినజాడ మరి కనుపించలేదు ఒక కుంపటి వొదిలిందని కమలమ్మ లోలోన సంతోషించింది వెళ్ళేముందు వాడి మొక్కమూరు చూడలేకపోయామే అని జానకి రామానుజయ్య విచారిస్తూనే వున్నారు. ఒకప్పుడు తండ్రిచేసిన తప్పుకి కుటుంబమంతా కలసి విధించిన పెద్దశిక్షను జోగయ్య

అమృతంలా అందుకున్నాడు. వాడిని జయించినవాడు మరి లేడనుకున్నారు.

కొద్దిరోజులుగడిచాయి. రామానుజయ్యకు క్షయచిహ్నాలు కనుపించాయి. కమలమ్మ గుండెలదరిపోయాయి. ఇంత పెంకె కమలమ్మ కుప్పలా కూలిపోయింది. పిల్లల్ని దగ్గరకులాక్కుని గడగడ వణికిపోయింది.

జానకి ట్రయినింగయితే అయింది కాని టీచర్‌పని దొరకటానికి మరి కొంతకాలం పడుతుందని అక్కడక్కడ ప్రైవేట్లు సంపాదించి అన్నయ్య కుటుంబానికి చేతనైన సహాయం చేస్తోంది.

ఒకరోజు నాయుడు బాబు పల్లెనుంచి పట్నం వచ్చాడు. రామానుజయ్య స్థితికి చాలా విచారించాడు. మాటల సందర్భంలో అన్నాడు.

'మనవాళ్ళు యుద్ధానికి రాయించుకున్నారు నాకు విచారంగా వున్నా ఏం చేస్తాం? వేరున్నవాళ్ళు నాలుగు అబద్ధాలాడి వాళ్ళను వాళ్ళు రక్షించుకోగలరు, కాని జోగయ్య నట్టి అమాయకుడు. పల్లె వాతావరణములో పెరిగాడు. ఇన్నాళ్ళూ ఎలా తట్టుకో గలుగుతున్నాడో ఏమో! వీళ్ళంతా ఒకేచోట బోంబాయికి దగ్గరనా వున్న కేంపులో వున్నారట! అంతా క్షేమంగా వున్నామంటూ మావాడు అప్పుడప్పుడు జాబులు రాస్తున్నాడు.'

జోగయ్య క్షేమంగా వున్నందుకు జానకి చాలా సంతోషించింది.

'నాయుడు బాబూ! వాళ్ళకు సెలవు లిస్తుంటారు కదూ?' అని జానకి అడిగింది.

'ఇస్తారమ్మా! వాళ్ళు వెళ్ళి నాలుగు నెలలేగా అయింది మరి రెండు నెలలలో సెలవుల్లో వస్తాడు.

రామానుజయ్య మౌనంగా వున్నాడు. జానకి ధైర్యం చేసుకుని అడిగింది 'నాయుడుబాబూ! ఇంటి కాగితాలు దగ్గిర పెట్టుకుని ఓ అయిదువందలరూపాయిలు అప్పుక్రింద ఇవ్వండి. మా అన్నయ్య క్షయతో బాధపడుతున్నాడు. మంచిమంచి ఇంగ్లీషు మందులు పాలుపళ్ళు వాడాలట'

ఇంతలో కమలమ్మ కాఫీ పట్టుకు వచ్చింది. నాయుడుబాబుని పుచ్చుకోమ్మని బలవంతం చేసింది నాయుడుబాబు కళ్ళ ముందు ప్రపంచపు తీరు గుర్తుకు వచ్చింది...జోగయ్యను తీసుకువచ్చినరోజు, అప్పుడప్పుడు జోగయ్యగురించి చెప్పటానికి కమలమ్మ ఇంటికి వచ్చినరోజులు ...పాలికాపుకన్న తన్ను హీనంగా చూసిన రోజులు...త్రుటిలో గుర్తుకు వచ్చాయి. ఐదువందలు డబ్బు కావలసివచ్చి ఓ కప్పు కాఫీ తీసుకువచ్చారు. ఆనాడు నిల్చునే మాట్లాడిన నాయుడుబాబు ఈనాడు కుర్చీలో కూర్చున్నాడు.

'కాఫీ చల్లారిపోతోంది... తీసికోండి నాయుడుబాబూ!'

మళ్ళీ ఈ ప్రపంచంలోనికి వచ్చిన నాయుడుబాబు 'ఛ! వెర్రివాళ్ళు ... వాళ్ళేదో తెలివితక్కువకొద్దీ అలా ప్రవర్తిస్తేనే కూడ కఠినంగావుండాలా వాళ్ళవసరం వచ్చిందని ... అపకారికి ఉపకారం చేయాలి' అని లోన అనుకున్నాడు. కాఫీ తీసుకుంటూ అన్నాడు.

'ఉన్నదంతా రైతులకు భూములమీద అప్పిచ్చానమ్మా! చేతిలో మీ రడిగినంత పైకం ఇప్పుడు లేదు ... ఊరికే ఇంతసేపూ ఆలోచిస్తున్నాను...ఒక్క మూడురోజులాగి ఇస్తేనో?'

'అలాగే నాయుడుబాబూ! మూడు రోజులేంటి! వారంరోజులైనా ఆగుతాము ...ఏదో డబ్బు సర్దటం కావాలి'

రామానుజయ్య ముఖము వికసించింది జానకి చొరవకు— నాయుడుబాబు మూడు రోజుల తర్వాత వస్తానని రామానుజయ్యను ధైర్యంగా వుండమనిచెప్పి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిన పావుగంటకు ఆ వార్డు పోస్టుమన్ త్రిపురారిభట్ల కమలమ్మపేర అరవైరూపాయిల మిలిటరీ అలాట్‌మెంట్ మనీఆర్డరు తీసుకువచ్చాడు.

'మిలిటరీలో వున్న జోగయ్య మీ వాళ్ళేనా అమ్మా?' అని పోస్టుమన్ అడిగాడు మావాడే అని కమలమ్మ అనలేకపోయింది.

'మా తమ్ముడేనయ్యా!' అని రామానుజయ్య సమాధానం చెప్పాడు.

'ప్రతినెలా అరవైరూపాయిలు మీ పేరను జబల్‌పూర్‌నుంచి వస్తుంటాయమ్మా! ఇదుగోండి ఫారం! సంతకం పెట్టండి'

మతిపోయిన మనిషిలా అయిపోయింది కమలమ్మ. జానకి సంతోషానికి అంతులేదు. జానకి చదివి చేత మనీఆర్డర్ ఫారం మీద సంతకం పెట్టించింది. కమలమ్మ సంతకంపెట్టి చరచరా లోనికి వెళ్ళిపోయింది. జానకి డబ్బు పుచ్చుకుంది.

కమలమ్మ జానకి ముఖంగాని రామానుజయ్య ముఖంగాని చూడలేకపోతోంది. జోగయ్య తనను వెక్కిరిస్తున్నట్లు బాధపడింది. లోనికి వెళ్ళి జానకి నచ్చచెప్పింది.

'వదినా! వాడి మనసు నీకు తెలీదు. చాల మంచివాడు. ఏదో డబ్బు సహాయం మనకు చేయాలనే పరుగెత్తుకెళ్ళాడని పంపించాడు. వాడికి మాత్రం ఎవరున్నారు చెప్పు నే మరికొన్ని ప్రైవేట్లు సంపాదించి మరి కొంచెడబ్బు సంపాదిస్తాను.

(63 వ పేజీ చూడండి)



# ** నటి రమాప్రభ

చిత్తూరుజిల్లా వాయిల్పాడ్ గ్రామంలో పుట్టింది రమాప్రభ. పుట్టిన మూడో సంవత్సరానికే ఈమెకు నాటకాలను చూడడం అలవాటయింది! ఆ అలవాటు నేటి జీవనోపాధికి వుపకారి అయింది. చదువుకున్నది మొదటి తరగతివరకే అయినా జీవితవిద్యలో ప్రవీణురాలయింది. మాతృభాష తమిళం; కానీ తెలుగు ఈమెకు వచ్చిన భాష. రెండింటిని అనర్గళంగా మాట్లాడుతుంది చిన్నతనంలోనే మేనమామ, మేనత్తల పంచన చేరింది. వారి అడుగుజాడల్లోనే పెరిగింది.

ఏదో తమాషాగా నేర్చుకున్న నాట్యం నేటి ఈమె సినీ జీవితప్రవేశానికి విచిత్రంగా దారితీసింది అది 1956వ సంవత్సరం. మద్రాసును చూడడానికివచ్చిన ఈమెకు సినిమాల్లో చేరాలనిపించింది. అదేపట్టుదల ఈమెను సుశిక్షితురాలయిన నాట్యకత్తెగా తీర్చిదిద్దింది. మద్రాసులో ప్రముఖ కళాకారుల మధ్య అరంగేట్రం యిచ్చేట్టు చేసింది ఇలా అరంగేట్రం చేస్తూవుండేప్పుడు, శ్రీ టి. ఆర్. రామన్న (ఆర్. ఆర్ పిక్చర్స్) ఈమెను 'పెరియయిడత్తు పెణ్'



పిల్లలంటేనూ బొమ్మలంటేనూ ప్రాణం!



మంచిమనసు, నిష్కపటత్వం రమాప్రభ ఆభరణాలు!

చిత్రంలో శ్రీమతి సరోజాదేవి చెలికత్తెగా నటింపచేసారు. కన్పడింది ఒకే దృశ్యంలో అయినా, పల్వురి గుర్తింపులో పడింది. దాని పర్యవసానంగా చిత్రాల్లో వేషాలు లభించ ప్రారంభించాయి 'పెళ్ళాం' చిత్రంలో పద్మశ్రీ శివాజితో నటించింది.

అవి కె. ప్రత్యగాత్మ 'చిలకా—గోరింకా' తీస్తున్న రోజులు రమాప్రభకు ఈ విషయం తెలిసింది. తన దగ్గరున్న అరడజను స్టిల్సును ప్రత్యగాత్మకు చూపెట్టింది. ఆయన ఆడైలాగ్సును పలుకమన్నారు పలికి చూపింది; చిత్రంలో వేషం ఓ. కే అయింది ఈ విధంగా మనకు పరిచయమయింది రమాప్రభ. ఆ చిత్రం విడుదలానంతరం తెలుగు నిర్మాతలు కూడ రమను వాళ్ల చిత్రాల్లో నిర్ణయిస్తూ వస్తున్నారు ఇప్పటికి షుమారు 25 చిత్రాల్లో (త[illegible] 4 తెలుగు) నటించింది

చామనచాయ దేహవర్ణం గల్గిన రమాప్రభకు భగవంతుడు విశాలమయిన కళ్లు, పొడుగయిన ముక్కు, చక్కటి షదుడు నిచ్చి, ప్రేక్షకులు మెచ్చే వరాన్ని ప్రసాదించడంతో తృప్తిపడక మంచి మనస్సును కలుపుగోలుతనాన్ని, నిష్కపటత్వాన్ని యిచ్చి ఈమెను సృష్టించడంలోనేవుంది ఔచిత్యం.

తీరిక దొరికినప్పుడల్లా తెలుగు డైలాగ్సును బాగా వుచ్చరించేందుకు ప్రాక్టీసు చేస్తుంది సాయంకాలంపూట

(61వ పేజీ చూడండి



'మంచి కుటుంబం'లో జానకి, పద్మశ్రీ నాగేశ్వరరావు.

చిత్రసమీక్ష:

# మంచి కుటుంబం

◘ 'సెక్స్‌లేకుండా చిత్రాలు సక్సెస్‌కావు' అనే నేటి చలనచిత్రరంగోక్తికి తగిన సమాధానం చెప్పే మంచి కుటుంబగాథా చిత్రం 'మంచి కుటుంబం.'

నాగేశ్వరరావు ఒక మోటారు కంపెనీ యజమాని అతనిభార్య జానకి కనకదుర్గ, విజయశ్రీ, విజయనిర్మల ఆదిగాగల మొత్తం ఏడుగురు పిల్లలు. అరమరికలులేని పాలవంటి స్వచ్ఛమైన కుటుంబంలో ఒకరోజు ఒక విషబిందువు' చిలుకుతుంది వచ్చిన కుర్రవాడు నాగేశ్వరరావును 'నాన్న' అంటాడు తత్ఫలితంగా — కనకదుర్గ—రామ్మోహన్, విజయశ్రీ — చంద్రమోహన్, విజయనిర్మల—కృష్ణ జంటలు (తాత్కాలికంగా) విడిపోతాయి. ఇక్కడ చలనచిత్రానికి కావలసిన విధంగా కాకుండా అతి సహజంగా జరుగుతుంది ఇదే కథలోని ప్రత్యేకత కుర్రవాడి ప్రవేశంతో మంచి కుటుంబమే కాకుండా మంచి ప్రేక్షకులు కూడా ఉలిక్కిపడతారు పాత్రలతో పాటు ఆందోళన చెందుతారు. తర్వాత ఒక ఉపకథ ఆరంభమవుతుంది అది రెండవ భార్య కథ ఇది మరీ విడ్డూరమైన సంగతి రెండవభార్య తన చెల్లెలిని పెళ్ళిచేసుకున్నప్పుడు, ఆమెని ఎటువంటి సందర్భంలో తనభర్త వివాహం చేసుకున్నాడో అవగాహన అయినప్పుడు, ఆమె త్యాగం అర్థమయినప్పుడు—జానకితోపాటు మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, త్యాగరాజు, తదితర ప్రధాన పాత్రధారులూ, ప్రేక్షకులూ నాగేశ్వరరావు మీద అంతులేని గవురవాన్ని చూపిస్తారు ఇదీ కథ .!

'పరిమిత కుటుంబమో!' అని మొత్తుకుంటున్న ప్రభుత్వంమాట నిర్మాతలు పక్కకి నెట్టివేసి — అపరిమిత కుటుంబంలోని మంచిని, ఆనందాన్ని, చిత్రీకరించడంలోని సొగసుని ప్రేక్షకులకి చూపించారు!

కథని పెంచడానికి కొన్ని బాక్సాఫీసు సూత్రాల్ని అవలంబించి అనవసరాన్ని అవసరమనిపించలేక పోయారు. జంటలకి రెండు డ్యూయెట్లు అనవసరం కాలేజీలో 'అంతర్నాటకం' చూస్తున్నంతసేపు బాగానే వుంది కాని బిగువైన అసలు కథ దాన్ని అనవసరం అనిపిస్తుంది. యుద్ధం సీను అక్కడి నృత్యం ఎబ్బెట్టుగా లేదు సవతి కొడుకు రాక, ఇంకో అమ్మకథ చిత్రానికి ఆయువుపట్టులు లేకపోతే కథ మామూలే!

చిత్రం రసవత్తరం కావడానికి ముఖ్యకారకులు పద్మశ్రీ నాగేశ్వరరావు నాగేశ్వరరావు నటజీవితంలో ఈ పాత్ర చిరస్మరణీయమైనదే పాత్రకి ప్రాణం పోశారనే వాక్యానికి ఇటువంటి సందర్భాలోనే న్యాయం జరుగుతుంది అలానే జానకి చాలా రోజులకి కనిపించి చాలా బాగా నటించా రనిపించుకున్నది. ఇక్కడ పాత్రకి తగిన నటీనటుల నెన్నుకున్న నిర్మాతలు తప్పక జ్ఞాపకం వస్తారు తక్కిన పాత్రలని గుమ్మడి, కృష్ణ, చంద్రమోహన్, చలం, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, కాంచన, విజయనిర్మల, గీతాంజలి, హేమలత, మొదలైనవారు చక్కగా పోషించి కథని రక్తి కట్టించారు

ఈ చిత్రం 'గృహస్తి'గా హిందీలోను, 'మోటారు సుందరంపిళ్ళె'గా అరవంలోను వచ్చినా వి మధుసూదనరావు దర్శకత్వం ప్రత్యేకతని ప్రేక్షకులు గుర్తించ గల్గుతారు కథకి ఆత్రేయ మాటలు రాశారు. కోదండపాణి సంగీతం కూర్చారు.

మంచి కుటుంబాన్ని అందరూ మెచ్చే విధంగా సమర్పించిన నిర్మాత పి. మల్లికార్జునరావు అభినందనీయులు.

—సికరాజు ●



'ప్రేమకథ'లో కె. ఆర్. విజయ.



'తిక్క శంకరయ్య'లో జయలలిత.

# సినిమా

## రెండు షెడ్యూల్సులో చిత్రం పూర్తి

శ్రీ గణేష్ మూవీస్ బ్యానర్‌లో శ్రీయుతులు ముళ్ళపూడి, బాపూలు నిర్మిస్తున్న 'స్వయంవరం' చిత్రం యొక్క షూటింగు హైదరాబాదు నగరంలో ముప్పాతిక పైభాగం నిర్మించబడగలదని, యీ చిత్రంలో హాస్యరసానికి ప్రాధాన్యత యివ్వబడిందని, నాయకీ, నాయకులుగా విజయనిర్మల, చంద్రమోహన్ నటిస్తున్నారని, శ్రీ మహదేవన్ సంగీత దర్శకత్వంలో శ్రీ బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి సుశీల పాడిన పాటలు మధురాతి మధురంగా వున్నాయని, యీ చిత్రాన్ని రెండు షెడ్యూల్సులో పూర్తి చేసే ప్రయత్నాలు చేస్తున్నామని శ్రీ ముళ్లపూడి వివరించారు.

* * *

'అత్తగారు-కొత్తకోడలు' చిత్రంలో హరనాథ్, జయంతిలు, కృష్ణ — విజయనిర్మలలు, రాజబాబు—రమాప్రభలు, సత్యనారాయణ—పుష్పకుమారి తను కిచ్చిన పాత్రలను బ్రహ్మాండంగా పోషించినట్లు అత్తగా శ్రీమతి సూర్యకాంతం అద్వితీయమయిన నటనను ప్రదర్శించిందని, సాక్షి రంగారావు చిత్ర రంగానికి కొత్తవాడయినా విశిష్టంగా నటించారని, ముఖ్యంగా శ్రీ కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణం చక్కటి ప్రమాణాల్లో వున్నట్లు దర్శకులు శ్రీ సంజీవి వెల్లడించారు 'ఇల్లాలు' చిత్రం తర్వాత తనకు యింతటి చక్కటి అవకాశాన్ని యిచ్చిన నిర్మాత శ్రీ బాబూరావు తనకు సర్వ విధాలా ప్రోత్సాహాన్నిచ్చి చిత్రాన్ని 'హిట్'గా తయారు చేసేందుకు తనకు సంపూర్ణ సహకారాన్నిచ్చినందుకు అతనికి తను సర్వదా కృతజ్ఞుడ్నిగా వుండగలనని వ్యక్తపర్చారు నిర్మాణ బాధ్యతా నిర్వహణలో శ్రీ నాగేశ్వరరావు, దర్శకత్వంలో శ్రీ ఎస్. హరి, పి. జి. ప్రసాద్, జి. రామమోహన్ ప్రదర్శించిన నైపుణ్యం మెచ్చుకోతగింది. కల్పనాచిత్ర నిర్మిస్తున్న యీ సాంఘిక చిత్రం మే నెలలో పూర్ణా ద్వారా విడుదలవుతుంది.



'రాము'లో జమున, ఎన్. టి. రామారావు

## నేను 'ఏలుమలయాలన్'

ఒక హాస్పిటల్ భవన సహాయార్థం శ్రీ పి. బి. శ్రీనివాస్, జానకిలు 'బెనిఫిట్ పెర్ఫార్మెన్స్' యిచ్చారు అక్కడ వున్న ఒక విచిత్రవ్యక్తి శ్రీనివాస్‌ను చూచి 'ఏమండీ—మీరంతా మలయాళీయులు కారే.' అన్నందుకు శీనయ్య నవ్వి 'అదేమిటయ్యా, ఎవరన్నారు ఆ మాట — 'నేను ఏలుమలయాలన్ (శ్రీ—నివాసుడు) ఆమె—జానకి — విజయవాడలో జన్మించింది. (అక్కడ కనకదుర్గ వుంది) అందుకని ఆమె కూడ మలయాళీయే' అని చెప్పడంతో అందరూ గొల్లుమని నవ్వారట!

శ్రీనివాస్‌కు తీరిక దొరికినప్పుడల్లా యిలా జోక్స్‌తో స్నేహితులకు కాలక్షేపాన్ని యిస్తూ, కాలాన్ని సంతోషంగా వెళ్లబుచ్చడం అలవాటు.

## తమిళంలో ''మూగమనసులు''

బాబూ మూవీస్ నిర్మించిన 'మూగమనసులు' చిత్రాన్ని శ్రీ ఎల్. వి. ప్రసాద్ హిందీలో 'మిలన్' పేరుతో నిర్మించారు. ఇప్పుడు తమిళంలో శ్రీమతి సావిత్రి, పద్మశ్రీ శివాజీగణేశన్‌ను నాయకుడిగా ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించడానికి విశ్వ

యించినట్లు, తెలుగులో తాను ధరించిన పాత్రను తమిళంలోకూడ ధరించడమేగాక, దర్శకత్వాన్నికూడా నిర్వహిస్తున్నట్లు, జమున వేషానికి కొత్తమ్మాయిని పెట్టదల్చు కున్నానని యిటీవల వీనస్ స్టుడియోలో వెల్లడించారు. ఇదిగాక, విజయచాముండేశ్వరి బ్యానర్‌లో నిర్మించే సాంఘిక చిత్రంలో జెమినిగణేష్ నాయకుడిగా వుండగలరని, యీ రెండు చిత్రాల నిర్మాణం తమిళ సంవత్సరాదికి ప్రారంభం కాగలదని వ్యక్త పర్చారు. ఈవిడ దర్శకత్వంలో 'చిన్నారి మనసులు' పూర్తికావచ్చింది.

సావిత్రి నటి అయినా, దర్శకురాలయినా ఆమె ప్రతిభ రాణించి తీరుతుంది.

*    *    *

'దొరికితే దొంగలు' చిత్రాన్ని డైరెక్టు చేసిన పి. సుబ్రహ్మణ్యం చాలకాలం తర్వాత మరొకసంస్థకు దర్శకునిగా నియమింపబడడం సంతోషించదగ్గ విషయం. శ్రీ డి. ఎల్. నారాయణ పద్మశ్రీ రామారావుతో 'నేను నా చిత్రానికి సుబ్రహ్మణ్యాన్ని దర్శకునిగా పెడుతున్నాను' అన్నప్పుడు ఆ నిండుమనిషి నన్ను ఆశీర్వదించడమేగాక, సెట్సులో నన్ను ప్రోత్సహించి, ధైర్యమిచ్చారు. ఆచిత్రం విజయవంతంగా ప్రదర్శింపబడిన విషయం అందరికీ తెలిసిందే. ఆ చిత్ర విజయం తర్వాత ఏ నిర్మాతకూడ సుబ్రహ్మణ్యానికి అవకాశం యివ్వక పోవడం విచిత్రంగా వున్నా, అది 'నా చెడ్డరోజు' అంటాడు సుబ్రహ్మణ్యం. ఇప్పుడు రోహిణి పిక్చర్స్ హైదరాబాదులో నిర్మిస్తున్న 'గుణదాస్' చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు. శ్రీ నాగేంద్రరావు నిర్మించే యీ చిత్రంలో శ్రీయుతులు ఎస్. వి. రంగారావు, చంద్రమోహన్, చంద్రకళ, విజయలలిత ముఖ్య పాత్రలను ధరిస్తున్నారు. శ్రీ ఆర్. వి. ఎస్. శర్మ వ్రాసిన యీ కథలోని సహాయ భూమికల్ని కొత్త నటీ, నటులు పోషిస్తారు.

## తెలుగూ తమిళంరాని మన సంగీతదర్శకుడు

ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ కె. వి. మహాదేవన్ గతనెల ఆఖరుకు 141 తమిళ చిత్రాలకు, 30 తెలుగు చిత్రాలకు స్వరకల్పన చేసివున్నారు. ఇప్పుడు 22



'పాలమనసులు'లో హరనాథ్, జమున.

తమిళ చిత్రాలకు, 8 తెలుగు చిత్రాలకు సంగీత సారథిగా నియమింపబడ్డారు.

పాలఘాట్ నివాసుడయిన శ్రీ మహాదేవన్‌కు తమిళంగానీ, తెలుగుగానీ యింతదాకా వ్రాయడానికిగానీ, చదవడానికిగానీ తెలియదు అంటే ఆశ్చర్యకరంగా వుంటుంది కానీ, యిది అక్షరాలా నిజం. అతిథులను ఆప్యాయంగా ఆదరించి, వారితో స్నేహంగా సంప్రదించి, మంచివాడు అని అందరిచేత అనిపించుకునే యీ సంగీత దర్శకుడికి యిటీవల బొంబాయిలోని 'షణ్ముగానంద సభ'లో—ప్రముఖ సంగీత నిర్దేశకుల సమక్షంలో శ్రీ సి. రామచంద్ర 'సంగీత చక్రవర్తి' బిరుదాన్నిచ్చి సత్కరించారు.

*    *    *

టి. సి. ఎస్. పిక్చర్స్‌లో నాయకీ, నాయకులుగా భారతి, కాంతారావులను పెట్టాలనుకుంటున్నట్లు నిర్మాత సుబ్బన్న వ్యక్తపర్చారు. శ్రీ గిడుతూరి సూర్యం దర్శకత్వంలో రత్నబాబు, శ్రీనివాసులు, రామయ్య, విశ్వేశ్వరరావు, శ్యామలరావు లాంటి కొత్త నటులు కొన్ని ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. శ్రీ జి. కె

# సినిమా డైరీ

- దేవర్ ఫిలింస్‌లో వాణిశ్రీ కథానాయికగా నటించేందుకు అంగీకరించింది. ఈమెతో జయశంకర్ నటిస్తారు.
- ప్రసాద్ ఆర్ట్సు 'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రంలో రాజశ్రీ, శోభన్‌బాబులు నాయకీ, నాయకులుగా నటిస్తున్నారు. శ్రీ కె. బాలచందర్ దర్శకత్వంలో చలం, రాజశ్రీ, శోభన్‌లకు సంబంధించిన సన్నివేశాలు వాహినీ స్టుడియోస్‌లో చిత్రించబడింది. ఈ చిత్రానికి ఎం. ఎస్. విశ్వనాథం సంగీత దర్శకుడు.
- బొంబాయిలో పద్మశ్రీ అశోక్‌కుమార్ పాల్గొన్న సభలో 'హిందీలో మాట్లాడండి' అని కొందరు, 'ఆంగ్లంలో మాట్లాడండి' అని కొందరు వాదించుకోవడంతో సభ అల్లరిపాలయింది.
- ప్రముఖ నటుడు శ్రీ దిలీప్‌కుమార్ నిర్మించే చిత్రానికి శ్రీ చాణక్య దర్శకులుగా నియమింప బడ్డారు. కాశ్మీరులో యీ చిత్రం యొక్క షూటింగు ప్రారంభింపబడుతుంది.
- శ్రీ కె. ఎస్. గోపాలక్రిష్ణన్ నిర్మించే తర్వాతి చిత్రానికి 'పోస్టుమాన్' అని పేరు పెట్టారు.

# సినిషా

మూర్తి, వసంతరావులు రచన సాగించిన యీ చిత్రం యొక్క షూటింగు ఏప్రిల్ 15 నుండి గోల్డెన్‌లో ప్రారంభమవుతుంది. కెమెరాను గోపాలరావు, సంగీతాన్ని కోదండపాణి, ఆర్టును వాగరాజన్ నిర్వహించే యీ జానపద చిత్రానికి శ్రీ కె. మ. నాయుడు నిర్వహణాధికారిగా వ్యవహరిస్తున్నారు.

* * *

శ్రీ గణేష్ పిక్చర్స్ నిర్మిస్తున్న 'సీతాకళ్యాణం' చిత్రానికి శ్రీ ముళ్లపూడి వెంకటరమణ రచన చేస్తున్నారు. అక్టోబరు నుండి ప్రారంభమయ్యే యీ చిత్రానికి సంజీవి దర్శకులు. కల్పనా చిత్ర షూటింగులో పూర్తిగా నిమగ్నులై వున్న సంజీవిగారికి 'సీతాకళ్యాణం' మూడవ చిత్రం అవుతుంది.

## సూర్యభగవానుని అవరోధం!

'శ్రీరామ కథ' షూటింగు మార్చి14న గిండీ ఫారెస్టులో ప్రారంభించబడింది. మొదటి షెడ్యూలులో నారదుడు, శ్రీరామచంద్రుని దివ్యకథామహిమను పాడుతూ రావడాన్ని దర్శకుడు శ్రీ పద్మనాభం చిత్రించారు. శ్రీరాముడుగా హరనాథ్, లక్ష్మణుడిగా రాం మోహన్. నారదుడుగా పద్మనాభం నటించారు. కీర్తి శేషులు సముద్రాల వెంకట రాఘవాచార్య విరచితమైన 'రామ కథ...శ్రీరామకథ' పాటకు పద్మనాభం, బాలసుబ్రహ్మణ్యం యిచ్చిన వాయిస్‌కు తగ్గట్టు అభినయించారు.

14 న గిండీ అడవుల్లో వర్కు సాఫీగా నడిచింది. కాని 15 న రేఖా అండ్ మురళీ యూనిట్ మణి మంగళానికి రామకృష్ణ, మీనాకుమారిలతో వెళ్లింది. కానీ సూర్యవంశక్షత్రియుడయిన శ్రీరామునికి ఆ సూర్యభగవానుడు అవరోధాన్ని కల్పించాడు. అంటే ఎండ లేదన్న మాట! అందువల్ల పద్మనాభం తన యూనిట్‌ను మద్రాసుకు మళ్లించారు.

* * *

ప్రస్తుతం పద్మశ్రీ నాగేశ్వరరావు జగపతి, మాధవి, ఎ. వి. ఎం. సంస్థలకు కాల్‌షీట్లు యిచ్చివున్నారు. సంవత్సరానికి ఆరు లేక ఏడు చిత్రాలకు పైగా నటించేందుకు వీలుపడడం లేదండీ అన్నారు. ఆగస్టునుండి అన్నపూర్ణా వర్కు మొదలు పెడ్తాం అన్నారు. ఇటీవల అనంతపూర్‌లో నెహ్రూ మెమోరియల్ ఫండ్‌కు తాను తన స్నేహితులతో వెళ్లి 1 లక్షకు పైగా 30 వేల రూపాయలను వినోదప్రదర్శన ద్వారా వసూలుచేసి యిచ్చినట్లు చెప్పారు.

—శ్రీనివాస్

## పద్మశ్రీ నాగేశ్వరరావుకు మద్రాసులో సన్మానం

శ్రీ అక్కినేని నాగేశ్వరరావుకు భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదంతో గౌరవించిన సందర్భంగా మద్రాసు ఫిలిం పత్రికా రచయితల సమాఖ్యవారు ఆయనని వుడ్‌లాండ్స్‌హోటల్‌లో ఘనంగా సన్మానించారు.

పెక్కుమంది పత్రికా రచయితలు హాజరయిన సభకి శ్రీ విద్వాన్ విశ్వం అధ్యక్షత వహించారు. శ్రీ శర్మ (వాగడా) సన్మాన పత్రాన్ని సమర్పించారు. సన్మాన సభకి సమాధానమిస్తూ శ్రీ నాగేశ్వరరావు పత్రికా రచయితల అధరాభిమానాలకి కృతజ్ఞతలు తెల్పుకున్నారు. నేటి అసభ్య చిత్రాల మీద ఆయన వ్యక్తిగత అభిప్రాయాన్ని తెలియజేస్తూ—అటువంటి చిత్రాలు యువతరాన్ని చెడుత్రోవలు పట్టించడానికి కారణమవుతాయని; తాము అలాంటి చిత్రాలలో నటించమని ప్రకటించారు. శ్రీ ఆనందన్ వందన సమర్పణ చేశారు.

—నీకరాజు

## మీకు తెలుసా?

ప్రముఖ దర్శక, నిర్మాత బి. విఠలాచార్య ఒకప్పుడు టూరింగ్ సినిమా టాకీసును నడిపారు.

పద్మశ్రీ నాగేశ్వరరావుకు ద్రాక్షతోటలున్నాయని మీకు తెలుసా.

కుమారి కాంచన అసలు పేరు వసుంధర.

కుమారి వాణిశ్రీ గత ఆదివారం ఒక 'సీమ కుక్క'ను కొన్నది.

శ్రీమతి శాంతకుమారి, శ్రీ నాగేశ్వరరావు ప్రేయసీ, ప్రియులుగా నటించిన చిత్రం 'మాయాలోకం'.

'హీరో' హరనాథ్ ప్రతి రోజు సిగరెట్లకు మాత్రం పదిరూపాయలు ఖర్చు పెడ్తారు.

యువనిర్మాత (కల్పన చిత్ర) శ్రీ బాబూరావు యింట్లో (హైద్రాబాదు) 2వేల రూపాయలు విలువ చేసే వస్తువులు దొంగిలించబడ్డాయి

శ్రీ నాగిరెడ్డి నిర్మించనున్న చిత్రంలో పద్మశ్రీ నాగేశ్వరరావు నటిస్తారు.

'మంచి కుటుంబం'లో నటించిన విజయశ్రీ యిప్పుడు పద్మిని పిక్చర్సులో ఎం. జి. ఆర్.తో నాయికగా నటిస్తోంది.

'పాప కోసం' దర్శకుడు జి. వి. ఆర్. శేషగిరిరావు, జ్యోతిశ్శాస్త్ర ప్రవీణుడు రామచంద్రరావుకు తోబుట్టువు.

శ్రీమతి దేవిక మధురలో వ్యవసాయ క్షేత్రాన్ని ప్రారంభించనున్నారు.

తమిళ నటుడు జయశంకర్‌కు 'దైవీక ఉఅవు' చిత్రంలో నెత్తిమీద పెద్దగాయం తగిలింది.



'అత్తగారు—కొత్తకోడలు'లో జయంతి, విజయనిర్మల.

# రమాప్రభ

(56వ పేజీ తరువాయి)

(షూటింగు లేనిరోజుల్లో) మెరీనా బీచ్ కెళ్లి ఏకాంతంగా యీ విశాల ప్రపంచాన్ని గూర్చి ఆలోచిస్తూ గంటలతరబడి కూర్చుంటుంది. ఇక యింటిదగ్గరంటారా — ప్రతిరోజూ దీప, ధూప నైవేద్యాలా ధన ఏడుకొండలస్వామికి, విఘ్నేశ్వరునికీ పూజచేస్తుంది. అందమయిన లటబొమ్మల్ని చంకలో పెట్టుకుని ముద్దులాడడం యీమెకొక సరదా. అంతటితో పూరుకోక, ఎక్కడయినాసరే చిన్న పాపాయి కంటబడితేవాలు అట్టే కౌగిలించేసుకుని ముద్దులవర్షం కురిపిస్తుంది.



'అసాధ్యుడు'లో రమాప్రభ.

విచిత్రమయిన వ్యక్తులు, వింతధోరణిలో తిరుగాడే మనుష్యులు సంచరించే యీ చిత్రరంగంలో క్షణక్షణానికి రంగులను మార్చుకోకుండా, అందరిని మెప్పించే వేర్పును వేర్చుకుని, 'రమాప్రభ' ఈజ్ యీక్విల్టు 'స్నేహప్రభ' అనిపించుకుంటూ, వారానికొక కొత్త చిత్రంలో నటించే అవకాశాన్ని యేర్పరచుకుంది. ●

# అవీ-యివీ...

## వివాహం

విశాలాంధ్ర పత్రికా సంపాదకులు శ్రీ గ్రాటగడ్డ రాజగోపాలరావుగారి దత్త పుత్రిక చి. సౌ. ఝాన్సీలక్ష్మిని డా. సి. యస్. రాయుడు (గన్నవరం) గారి రెండవ కుమారుడు డి. బసంత్‌కుమార్‌కి, కుమార్తె చి. సౌ. ఉషని డా. కె. హనుమంతరావు (బోధన్) గారి జ్యేష్ఠ కుమారుడు డి. సాయాజీరావుకి ఇచ్చి మార్చి పదవ తేదీన విజయవాడలో వైభవంగా వివాహం జరిపించారు.

* * *

'విజయా కంబయిన్స్' భాగస్తులు శ్రీ నూరెడ్డి వెంకట రామయ్యగారి కుమారుడు చి. రాజేంద్రప్రసాద్‌కి శ్రీ డి. రాఘవయ్య చౌదరిగారి కుమార్తె చి. సౌ. శాంతదేవికి గుంటూరు జిల్లా కారంచేడు గ్రామంలో మార్చి 18వ తేదీన వైభవంగా వివాహం జరిగింది.

## సింథాల్ అదే కన్‌గల్ పోటీ

ఎ. వి. యమ్. ప్రొడక్షన్సు గోద్రెజ్ సోప్స్‌వారు కలిసి 'అదే కన్గల్' (అవేకళ్ళు) చలనచిత్ర సహాధారంగా ఒక పోటీని నిర్వహించారు. పోటీలో గెలుపొందిన వారికి మద్రాసు అశోకా హోటల్‌లో బహుమతి ప్రదానం చేశారు. మద్రాసు మంత్రి డా. సత్యవాణిముత్తు ముఖ్య అతిథిగా వచ్చి సభకి అధ్యక్షత వహించారు. 'అదే కన్గల్' చిత్రంలో కథానాయికగా నటించిన కుమారి కాంచన బహుమతుల్ని పంచిపెట్టారు. శ్రీ జావర్ సీతారామన్ సభికులకి స్వాగతం పల్కారు.

గోద్రెజ్ సోప్స్ మద్రాసు మానేజరు శ్రీఏ. కె. (యస్. రావు పోటీ వివరాల్ని అందచేస్తూ అసంఖ్యాకమైన ఎంట్రీలు రావడంతో గెలుపొందినవారు కూడా అధిక సంఖ్యలో వచ్చారని— అందుచేత బహుమతి మొత్తాన్ని వాళ్ళందరికి సరిసమానంగా పంచవలసి వచ్చిందనీ తెలియపరిచారు. సింథాల్ సబ్బును సినిమా పరిశ్రమకి ఎలా ముడిపెట్టారో వివరిస్తూ శ్రీమతి అనసూయా గోడీవాలా (పబ్లిసిటీ మానేజర్) వందన సమర్పణ చేశారు. అనంతరం సినీతార కుమారి నిర్మల నృత్య ప్రదర్శన జరిగింది.

—సితరాజు ●




సింథల్ అదేకంగల్ పోటీలో బహుమతి ప్రధానోత్సవానంతరం వందనసమర్పణ చేస్తున్న గోద్రెజ్ సోప్స్ పబ్లిసిటీ ఆఫీసరు శ్రీమతి అనసూయ గోడ్డివాలా, ప్రఖ్యాతనటి కాంచన, గోద్రెజ్ సోప్స్ మద్రాసు మేనేజరు శ్రీ కె. యస్. రావు ఈ ఫోటోలో కనిపిస్తారు.

# కృష్ణాజిల్లా రచయితల మహాసభ

ఈనెల 10, 11 తేదీలలో విజయవాడ రామమోహన లైబ్రరీహాలులో కృష్ణాజిల్లా రచయితల మహాసభలు జరిగాయి. జిల్లాలో అనేక ప్రాంతాలనుంచి ప్రతినిధులు బహుళ సంఖ్యలోనే ఈ సభలలో పాల్గొన్నారు.

కృష్ణా మండలంలోని రచయితలను, కవులను, ఇతర కళాకారులను ఒకచోట చేర్చి పరస్పర పరిచయం, అవగాహన పెంపొందింపడం, వివిధ రంగాలలో ప్రసిద్ధులైనవారిచేత ప్రసంగాలు చదివించి వదిరవాల దృక్పథాలను సహృదయంతో అర్థం చేసుకునే వాతావరణం కల్పించడం—సభా నిర్వాహకులు వేదికమీది నుంచి చెప్పిన ప్రకారం మహాసభ లక్ష్యాలు.

ఈ సంవత్సరం జరిగిన సభలూ, వివిధ ప్రక్రియలమీద సదస్సులూ ఎంతో 'జయప్రదంగా జరిగాయనీ, 'ఫలప్రదంగా జరిగాయ'నీ,చెప్పడానికి వెనుకాడక తప్పదు నిర్వాహకుల ఆశయాలూ, లక్ష్యాలూ ఎంతవరకు నెరవేరాయనే దృష్టితో ఆలోచించినప్పుడు ఈ సభలు విఫలమైనాయని చెప్పలేముగాని, జయప్రదంగా జరిగినవని కూడా చెప్పేందుకు వీలులేదు.

సభా ప్రారంభకులు జనసంబంధ శాఖామాత్యులు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీగారు ఈ మహాసభల సందర్భంలో ప్రత్యేకంగా ముద్రించబడిన 'సావనీర్'ను ఆవిష్కరించారు. సభాధ్యక్షులు శ్రీ టి. వి. ఎస్. చలపతిరావుగారు రచయితలలో చిత్తశుద్ధి, ఋజువర్తనా పెంపొందవలసిన అవసరం ఎంతో ఉన్నదనీ ఈ సంధికాలంలో రచయితల మీద గొప్ప బాధ్యత ఉన్నదనీ వక్కాణించారు.

ఆనాటి మధ్యాహ్నం సభకు హాజరైన ప్రతినిధులలో కొందరు స్వీయకవితాగానం చేశారు.

సాయంకాలం ఆధునిక కవిత్వం, వైజ్ఞానిక సాహిత్యంపై జరిగిన సదస్సులో 'ఆధునిక గేయ కవిత్వంపై పాశ్చాత్య ప్రభావము' అన్న అంశంపై ఒకరూ, 'స్వాతంత్ర్యానంతరం ఆధునిక కవిత్వము' అనే శీర్షికతో మరొకరూ చక్కని ప్రసంగాలు చేశారు. 'తెలుగులో పాపులర్ సైన్సు' అనే విషయంపై చదువబడిన ప్రసంగం ప్రాసంగికుల చిత్తశుద్ధిని, వారు మంచి ప్రసంగం తయారుచేసేందుకు చేసిన కృషిని వ్యక్తం చేసింది.

తరువాత నవలాసాహిత్యంపై జరిగిన సదస్సులో వక్తలు సభికులకు ఆధునిక తెలుగు నవలాసాహిత్యంపై ఒక నిర్దిష్టమైన దృక్పథం అందించే ప్రయత్నం చేశారు. కాని ఆమూడు ప్రసంగాలలోనూ రెండుమాత్రమే సూటిగా, నిష్కర్షగా కొనసాగాయి.

రెండవరోజు ఉదయం తొమ్మిది గంటలకు ప్రారంభం కావలసిన 'కథా సాహిత్యం'పై సదస్సు నీరసంగా, ఏ ఫలితమూలేకుండా జరిగింది.

మధ్యాహ్నం జరిగిన ప్రతినిధుల సమావేశంలో కొన్ని తీర్మానాలు చేయబడినవి. వాటిలో అతిముఖ్యమైనది. ఈనాడు విశృంఖలంగా స్వేచ్ఛగా వెలువడుతున్న అశ్లీల సాహిత్యాన్ని గురించినది. రచయితలు అట్టి అశ్లీల రచనలకు పూనుకోరాదనీ, ప్రభుత్వం తగు కట్టుదిట్టాలుచేసి అట్టి సాహిత్యం, వెలువడకుండా, 'సర్క్యులేట్' కాకుండా శ్రద్ధవహించాలనీ ఆ తీర్మానంలో సూచించారు.

'బాల వాఙ్మయం', 'తెలుగు సాహిత్యంలో తాత్త్వక చింతన' అనే రెండు ప్రసంగాలూ శ్రోతలను గొప్పగా ఆకర్షించాయి.

'పూర్ణ' అధినేత శ్రీ బి. కామరాజు అధ్యక్షతను జరిగిన 'సాంస్కృతిక సదస్సు'లో ముగ్గురు వ్యక్తులు ప్రసంగించారు. వారిలో ఇద్దరి సుదీర్ఘ ప్రసంగాలు వారు ఈ విషయాలను గురించి కూలంకషంగా ఆలోచించారని విదితం చేశాయి.

తరువాత ధారా సోదరులు ప్రదర్శించిన 'నాట్యావధానం' కార్యక్రమం ఎంతో జయప్రదంగా జరిగింది. ఈ కార్యక్రమం సభలకు 'హైలైట్' అనిపించింది.

—ఒక సదస్యుడు.



కృష్ణాజిల్లా రచయితల మహాసభ ప్రారంభోత్సవ సమయంలో చిత్రం.

ఆటలు

## భారత్ నేర్చుకోవలసినది!



నాలుగు నెలల పాటు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్లు పర్యటించి భారత క్రికెట్ జట్టు స్వదేశానికి తిరిగి వచ్చేసింది. 1966 డిసెంబరునుంచి ఇండియన్లు ఎన్నో పెద్ద టెస్టుమాచ్‌లు ఆడారు. వెస్ట్ ఇండీస్ జట్టుతో గెలవకుండా సోబర్స్ అడ్డు నిలిచాడు. మనవాళ్ళు కావలసినన్ని పొరపాట్లుకూడా చేశారు. ఏది ఏమయితేనేమి ప్రపంచ చాంపియన్లని ఓడించే అవకాశం పోగొట్టుకున్నాము. కొన్ని నెలల్లో మనజట్టు ఇంగ్లండుకి వెళ్ళింది. అక్కడినుంచి దేశానికి తిరిగిరాగానే ఆటగాళ్లు రంజీట్రాఫీ, దులీప్ ట్రాఫీలలోకి దిగారు. ఆ తర్వాత ఆస్ట్రేలియా వెళ్ళారు.

అంటే వీరికి సరయిన విశ్రాంతి లేనేలేదన్నమాట.

అంతేకాక, ఇంత ప్రయాస, ప్రయత్నం తర్వాత విదేశాలలో తేలికగా అపజయాలు పొందారంటే అది మనకి గర్వకారణం కాదు కదా! ఇంగ్లండులో వాతావరణం బాగాలేదు, చాలామందికి దెబ్బలు తగిలాయి. హటాత్తుగా పాటవుడీనవాబు ఉజ్వలంగా ఆడి లార్డ్ టెస్టులో వందపరుగులు చేశాడు. తక్కినవారు కొందరు అప్పుడప్పుడు బాగా ఆడినా మొత్తంమీద బాగా ఆడలేదు. మనవారికి ఏకాగ్రత, పట్టుదల తక్కువ అని ఇంతకిముందే చెప్పాను. మళ్ళీ చెప్తున్నాను. ముందుజాగ్రత్త పడకుండా చివరికి ఎంత బాగా ఆడితే మాత్రం ఏమిలాభం? పాతపొరపాట్లని పట్టి భవిష్యత్తు మెరుగుపడుతుందని ఆశించాలి మనం, అంతే.

న్యూజిలాండ్ టెస్టు కనక గెలవకపోతే అంతర్జాతీయ క్రికెట్ రంగంలో భారతదేశం అట్టడుగు పదవిని ఆక్రమించేది!

ఇప్పటికయినా ఆలస్యం కాలేదు. నేటినుంచీ ప్రయత్నంచేస్తే మంచి జట్టుని తయారుచెయ్యవచ్చు.

మనకి మంచిఫాస్ట్‌బవులర్ అవసరం. ప్రతి రాష్ట్రంలోనూ మంచి ఆటగాళ్ల కోసం వెతకాలి. వారినందరినీ పోగు చేసి బాగా తర్ఫీదుచెయ్యాలి. మనకి 'సరుకు' తక్కువలేదు, అవకాశాలే బాగాలేవు.

మరొక్కమాట — కేవలం స్పిన్ బవులర్లమీద ఆధారపడి లాభంలేదు.

బాట్స్‌మన్ సంగతి ఏమిటి, అంటే— ఒక జతని తయారు చెయ్యాలి. వాళ్లనే 'ఓపెనింగ్'కి పంపిస్తూ ఉండాలి. ఇంజనీర్ మంచి ఆటగాడే కాని అతన్ని కొంచెం కిందికి జరపాలి. సర్దేశాయి ఇంకా దారిలోకి రాలేదని నాకు అనిపిస్తోంది!

పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో జరిగిన మాచ్‌లో ఇంగ్లండు నాలుగవ టెస్ట్‌ని వెస్ట్ ఇండీస్‌మీద గెలిచింది. 160 నిముషాలలో 215 పరుగులువేశారు బ్రిటిషు ఆటగాళ్ళు! వెస్ట్ ఇండీస్ వారు 7 వికెట్లకి 526 వేశారు (బుచ్చరు, కన్హాయి, నర్సులు సెంచురీలు చేశారు) కాని లాభం లేకపోయింది. సోబర్స్ 92కి 2 వద్ద డిక్లేర్ చేశాడు, తన బలాన్ని అతిగా అంచనా వేసుకున్నాడు — మంచి బవులర్ హాల్ సరిగ్గా ఆడలేకపోయాడు, గ్రిఫిత్‌కి దెబ్బతగిలింది. బ్రిటిషు జట్టువారు హాయిగా పరుగులు పేర్చుకున్నారు. కవుడ్రే 71, బాయికాట్ 80 (నాట్అవుట్)లతో ఇంగ్లండు 7 వికెట్లతో గెలిచింది!

ఇది నిజమయిన క్రికెట్ ఆట. కవుడ్రేని ఎంత పొగడినా సరిపోదు!

—కె. ఎస్. నరసింహన్.

# పుస్తకాలు

### పిడికెడు ఆకాశం

రచన: శ్రీ గొల్లపూడి మారుతిరావు. ఎమెస్కో పాకెట్ బుక్, 208 పేజీలు. రు. 2. ప్రకాశకులు: ఎం. శేషాచలంకంపెనీ, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్.

ఇంతకుముందల్లా 'బాగున్నావా సీతమ్మా?—' అని పలకరించేవాళ్ళు ఇప్పుడు 'నీకేమమ్మా బంగారు పిచ్చుకవి. కష్టం వచ్చినా సుఖం వచ్చినా ఆదుకునే ఆప్తులున్నారు. కానివాళ్ళయినా నువ్వు తలుచుకుంటే అవసరానికి నీవాళ్ళే అవుతారు' అంటున్నారు.

సీతలో ఇంత మార్పుకి కారణమేమిటి?— లోకంలో సీతపట్ల ఇంత మార్పెందుకు వచ్చింది?'

ఇంత పరపతి సంపాదించిన సీత నిజంగా ఓడిపోయిందా?—లేదు. కాస్తంత కాలు జారింది, అంతే. లోకం ఆమెను ఉపయోగించుకుంది—కాని, ఆమెకు ఉపయోగపడలేదు. భర్తను సంపాదించుకునే హక్కు ఆమె కింక లేకుండ చేసింది.

అయితే—మరి నాలుగోసారి తనకు తనే అహోబలరావు ఆకలి తీర్చటానికి సిద్ధపడిందే! ఈమాటు సీత ఓడిపోలేదు. గెలిచింది. జయించింది. మానవుడి అజ్ఞానాన్ని జయించింది.

సుప్రసిద్ధ రచయిత శ్రీ మారుతిరావు ఈ నవలలో సరికొత్త పంథాను తొక్కారు. ఒడుదుడుకులు లేవు. చకచక నడుస్తుంది. అయితే— సీతకు జరిగిన అన్యాయం మనసుకు అలానే నిలిచిపోయింది. నవల విషయానికి ముఖచిత్రానికి పొత్తిగా పొత్తు కనబడదు.

—శివకుమారి

### త్యాగజీవి

నాటక. రచన 'శారద'. 45 పేజీలుగల ఈ నాటిక వెల రు. 1—25 పైసలు. ప్రతులకు: వీనస్ బుక్ హౌస్, ట్రంక్‌రోడ్, నెల్లూరు.

### శ్రీ ప్రభాకరా

పద్యశతకం. రచయిత శ్రీ ఘండికోట ప్రభాకరశర్మ. ప్రతులకు సంజరీ పబ్లికేషన్సు, మచిలీపట్నం.

### శ్రీనివాసకళ్యాణము

పద్యకావ్యము. రచయిత: అభినవ ధూర్జటి, కవికోకిల కృత్తివెంటి వెంకటేశ్వరరవు, వెల: రెండు రూపాయలు. ప్రతులకు శ్రీవెంకటేశ్వర గ్రంథమాల, కొత్తపేట, గుడివాడ (కృ. జి.).

### బాలాజీ నీతిమాల

నీతిశతకం. రచన: బలశ్రీ. 156 గీతాలు కల పుస్తకం వెల: 75 పైసలు. ప్రతులకు జక్కుల పరశ్రీ, జక్కుల భవనము, కృష్ణయ్యశెట్టివీధి, నెల్లూరు, నెల్లూరుజిల్లా.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# కడజను యింత చక్కని ఫోటోలు తీయండి



రు. 46.50

## ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠము
వదలి పెట్టుట కష్టము

- గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కుపెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశంలేదు.
- 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6X6 సెం. మి) ఫోటోలు తీయవచ్చు.
- ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు, యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.



కళ కళ లాడే ప్రింట్లకు
ఎన్‌లార్జిమెంట్లకు అగ్ఫా ఫొటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

అగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.



దేశానికంతా డిస్ట్రిబ్యూటర్లు :
ఆగ్ఫా-గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు

GNAG-103 203 TL